# నాగార్జున సాగరం

[ గేయకావ్యం ]

*

సి. నారాయణరెడ్డి

*

ప్రచురణ:
తెలంగాణా రచయితల సంఘం
హైద్రాబాదు

# మంగళాశాసనము

## శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు

ఈ మధురభావనామయ కావ్యమునకు ఉపోద్ఘాతము వ్రాయఁగోరి శ్రీ నారాయణరెడ్డిగారు నన్ను సన్మానించినారు. అందుకు నా ధన్యవాదములు.

తరుణ వయస్సులో నున్నను ఈకవి కావ్యసౌరభములు ఈవరకే ఎంతో కాలముగా తెలుగుదేశపు మూల మూలలను ప్రసరించినవి. ప్రాచీనాధునిక సంస్కారాలు రెంటినిగూడ ఔచిత్య మెఱిగి సమేళము చేసికొని భావనలను భాషను సంయమముతో నడపఁగల నేఁటి ప్రతిభాశాలులు కొందఱే. అట్టి కవుల అగ్రపంక్తిలోని వారు రెడ్డిగారు.

ఇది గేయ కావ్యమన్నారు కవిగారు. గేయములందు కాలలయమగు మాత్రానియమము మాత్రమే కాక నాదలయమగు స్వరనియమము గూడ అవశ్యకమే. కాని నేఁటి గేయకవులు ఆనాదమును పూర్తిగా చదువరులకే వదలి కృతకృత్యత ననుభవించుచున్నారు. ఈ కావ్యముగూడ ఆ దృష్టితోనే రచింపఁబడినది. నాదకాల నియములు రెంటినిగూడ చదువరుల స్వేచ్ఛకు వదలినవారు ప్రాచీన వృత్త జాత్యుపజాతి కవులు. వారేర్పఱచుకొన్న నియమమంతా అక్షరమాత్రా సంఖ్యకు చేరి నియమమాత్ర ఫలకమై నిలిచినది. ద్విపద, సీసము, రగడ మొదలగు కొన్ని నిబంధములు మాత్రమే తెలుగు సారస్వతమున కొంత శిథిలలయ బంధమును ఇంకను పట్టుకొన్నవి.

నాద నియమము రాగము. కాలనియమము తాళము. ఈ రెంటిలో లయించి పనిచేయుట పాట. అర్థభావములందు లయముననుభవింపఁగోరు కవికి పైరెండు నియమములును అలంకారములుగా మాత్రమే అప్పుడప్పుడు పనికిరాఁగలవు. అంతేకాని, వేరువేరు రూపరేఖా ప్రమాణములుగల అర్థభావములను, వానిని వెలువఱచు భాషను, ఆ నియమములతో బిగించి కవి నడపఁలేడు. అప్రయత్నములో అతఁడు గాయకుడు కాఁగలఁడేమో కాని కవిగా మాత్రము మిగులలేఁడు

ఆవర్తముల తుదమొదళ్ళను, వానినడుమ నుండవలసిన విఖుపులను తాళమందు యతిప్రాసలు నికరముగా చూపి పెట్టును గనుక, ఆయాచోట్ల తెగిపడు భావములను వానినితెంచు భాషను రచించుట ప్రాయికముగా అసాధ్యము. కనుకనే కవులు గేయరచనా నిర్బంధములను కొంచెము కొంచెముగా సడలించుకొనుచునే నడచినారు. తుదకు రాగతాళములకును, వట్టి లయకును కవితాకళతో సంబంధమే అపురూపమైనది. యతిప్రాసలు కొన్నిచోట్ల నియమములేని శబ్దాలంకారములైనవి. తెలుగు కవులలో అవి రెండును ఉన్నవనుకొని లాక్షణికముగా తృప్తిపడుటకు మాత్రము పనికివచ్చిన నిర్బంధములైనవి.

ఈ సహజపరిణామముతో తృప్తిపడలేని కొందఱు, రాగతాళములమాట యెట్లున్నను, లయప్రధానముగా నైనను కవితారచన సాధించు ప్రయత్నమును జేయుచునే యున్నారు. చిక్కులులేని యేరాగ ధాటిలోనైనను ఇచ్చవచ్చినట్లు వీనిని పాడుకొనవచ్చును. ఆధాటినిగూడ కవియే సూచించెనేని మంచిదే. లయమయమైన గణములను పంక్తి కిన్నియని లెక్కించి నడుపునది తాళము. దీనిని ఈగేయ కవితలో నిర్వహించుట సాధ్యముకాదు.

(౧) ఇక్ష్వాకు వంశక్షి
తీంద్రచంద్రుల కీర్తి
కౌముదులు నల్గడల
కలయ విరిసిననాడు -

(౨) కృష్ణవేణీ తరం
గిణీ పయఃకింకిణులు
త్రిశరణక్వాణాల
దెసల నింపిననాడు -

ఇందలి ఒక్కొక్కవాక్యమును ఐదైదు మాత్రలగణములు ఎనిమిదిగలిగి ఖండగతిగల ఆదితాళమునఁ గూర్పబఁడినది. కాని సరిపెణవలె అఖండముగా సాగిన యీ నడకలో భావము ముగిసినప్పుడుగూడ విశ్రాంతికి చోటులేదు. విశ్రాంతి తీసికొంటిమా తాళము పటాపంచలగును. దానికై ఆ విశ్రాంతికాలమును చక్కగా

నలువదిమాత్రలకాలము పెంచితిమా పూర్వోత్తరభావములు పరస్పరము అసంబద్ధములుగా సాగును. కనుక ఈ రచనలో ప్రధానమయిన మూలద్రవ్యము లయ మాత్రమే. అది చదువరులను తనవెంటనీడ్చుకొని పోవుచు అలౌకికముగా కావ్య రసము ననుభవించుటకెంతో సహాయపడును. మఱి అందందు రసభావానుగుణముగా ఆలయనుగూడ మనము సడలించుకొనవలసియుండును కావ్యకళకు పరమార్థమదే కనుక. లేకున్న ఆ బంధము బిగువై తప్పెటవాద్యమువలె మనలను శుష్కపఱుచును.

ఏకప్రమాణముగల మాత్రల నడక లయ. అది గణములు గణములుగా నడచును. ఆ గణములు అనంతవిధములైనను స్పష్టమై సుగ్రహమయిన భేదముగలవి ఐదని లాక్షణికుల నిర్ణయము : త్ర్యస్రము, చతురశ్రము, ఖండము, మిశ్రము, సంకీర్ణము అని. వానికి క్రమముగా ౩, ౪, ౫, ౭, ౯ మాత్రలుండును. అందు సంకీర్ణలయగూడ సుగ్రహముకాదని, చతురశ్రఖండముల కూర్పుగానే నడపవలసియున్నదని, వ్యావహారికముగా దాని నుదాసీనముగా నుంచుకొన్నారు గాయకులు. తక్కిన నాల్గింటిని యథారుచిగా వాడుచున్నారు దేశీయ చ్ఛందస్సులలో. తెలుగు 'రగడ'లలో ఈ నాల్గింటిని చూడవచ్చును. కాని, కారణమేమో చెప్పలేము. తెలుగు దేశ్యరచనలలో ౫-౭ మాత్రల ఖండమిశ్రగతులే యెక్కువ వ్యాప్తిలోనికి వచ్చినవి. అందును మిశ్రమునకంటె ఖండమే ప్రబలము. మనదేశ్యచ్ఛందస్సులైన అక్కరలు, సీసము, ద్విపద, దండకము - వీనియందెల్ల సామ్రాజ్యముచేయుచున్నదిదే. కన్నడభాషలో భిన్నలయము నాధారముగాఁ గొని నడచుషట్పదులలో మిశ్రమరూపమయిన 'భామినీషట్పది' అనూచానముగా చాలా వ్యాప్తిలో నున్నది. కాని అక్కడగూడ ఆధునిక స్వాతంత్ర్యముతో రచించుకవులు ఖండగతినే యెక్కువగా వాడుచున్నారు.

శ్రీ నారాయణరెడ్డిగారుగూడ ఈ కావ్యములో ఎక్కువపాలు ఖండగతినే నడపినారు. తృతీయతరంగము మొదటిఖండమందుమాత్రమే కొంత మిశ్రగతి చూపినారు. అదే తరంగమందే- ౫౫ వ పుటలో-

'ఆమె చలించెను ఆమనిపోలిక'

ఇత్యాదిగా ఆ పంక్తులలో మాత్రమే చతురస్రగతి స్పష్టముగాచూపి చాలించుకొన్నారు. పంక్తికి పండ్రెండు మాత్రలుగా రూపకతాళములో వీరు పొదిగిన త్ర్యస్రగతి, ఎందో యొకటి రెండు చోటులఁదప్ప, చతురశ్ర రూపముగానే వెలసినది. వీరి ధారాబలమంతయు ఖండగతియందే యెక్కువ కానవచ్చుచున్నది. వీరెంతో ప్రియపడి ఈ కావ్యమందు వర్ణించిన కృష్ణవేణీ ప్రవాహమువలెనే వీరి కవితాలహరికూడ ఒడుదుడుకులు లేక, అడ్డమాఁకలు లేక, విశాల గంభీరమూర్తితో ప్రసన్న మధురమై నడచి వచ్చినది. భావములన్నియు చతుష్పదములుగానో ద్విపదములుగానో ముగిసి నడచుట ఈ గేయకావ్యమున కందమిచ్చిన ముఖ్యమూర్తి. సంయుక్త పూర్వాక్షర శిథిలత, ఆదిమధ్యాంతములలోను అతుకుల బొంతలైన సమాసములు, అపూర్వ శబ్దములు, మొదలగు పుల్లలీ పానకములోలేవు. ఉన్న యొకటి రెండు ప్రవాహము పోవు అడ్డుచొప్పులవంటి వంతే. అడుగడుగునకును ఇందు యతిప్రాసయతులను నియమితముగానే ప్రయోగించినను వాని కళ్ళెము కవిచేతులలోనే భద్రముగా నిలిచినది.

విరక్తియను మోక్షరహస్యమునకును రక్తియను బంధరహస్యమునకును గల అనాది స్పర్థ - అది అనంతముగూడ - ఇందలి కథాబీజము. బౌద్ధమత ప్రచారము ప్రపంచమందంతా జయశీలముగా సాగుచుండిన కాలమది. నాగార్జున గిరియందలి మహాచైత్యము శిల్పారామముగా నిర్మింపబడుచున్ననాళ్ళవి. శిల్పసృష్టికై మతాచార్యునిచే నియుక్తుఁడైన పద్మదేవుఁడు ఈ కథానాయకుఁడు; తరుణుఁడు; సుందరుడు; గానమూ, చిత్రకర్మ, విగ్రహరచన అను మూఁడు కళలయందును సిద్ధహస్తుడైన సహృదయుఁడు. 'ఆంధ్రుఁడతడు' అని రెడ్డిగారు స్వాభావికముగా నూహించినారు. కాని అంతటితో తృప్తిపడక 'అనంత విశ్వాత్మజుండు' అని వారి కవి హృదయము అతని వ్యక్తిని విరివి చేసినది. కనుక

'అతనికి ప్రాంతపుటెల్లలు
అక్షిగోచరములు కావు,
అతనికి మతవైషమ్యము
లణుమాత్రము తెలియరావు'. (పు. ౯)

బుద్ధభగవానుని జీవితగాథలు కళకై యతనికి రుచించినవి కాని బౌద్ధమతమునందు కాని బౌద్ధ భిక్షువులయెడఁగాని అతనికి శ్రద్ధాగౌరవములు లేవు.

కథానాయిక శాంతిశ్రీ; అచ్చటి సంఘారామమున ఆచార్యునివద్ద బౌద్ధ సిద్ధాంత తత్వముల నభ్యసించుటకై వచ్చిన విద్యార్థిని. తరుణి; సుందరి. ఆమెది 'కళాత్మక జీవనము'; ఆమె నేర్చినకళ యేదో కవి చెప్పలేదు. కాని నృత్యగీతము లందు అభినివేశము గలదియని సూచించినారు. మఱి ఆమె యేదేశముదో మనకు తెలియదు. అక్కఱలేదు గూడ. స్త్రీ సహజమైన హృదయద్రుతి గలిగినది, కనుక గురుదేవుని విరక్తి 'ధర్మపీయూషవిమలోర్మికా డోలికలలో నోలలాడి'నది ఆమె హృదయము. మఱి

'ప్రకృతిలోని ప్రత్యణువున
పరమాద్భుత శోభాన్విత
సౌందర్యము నిర్లిప్త
స్థాయిలోన నిద్రించును' (పు. ౨౯)

గనుక దానిని మేల్కొలుపుటయే జీవిత పరమార్థముగా నెంచిన పద్మదేవుని తారుణ్య సౌందర్య చాతుర్యములకు ఆమె పరవశయై అట్లే ఆత్మార్పణము చేసినది. ఈ యిరువురి 'విలాసజీవన పిపాస'ను తెంపు ప్రయత్నములో ఆచార్య డామెకు శాశ్వత బ్రహ్మచర్యదీక్ష నియ్యఁగలిగినాఁడు. ఆధిభౌతికముగా శాంతిశ్రీ విరక్తి దీక్షను తీసికొన్నను ఆధ్యాత్మికముగా రక్తిని త్యజింపలేక తపించినది. పద్మదేవుఁడు పౌరుషముతో ఆసంఘమును కళామయమైన తన యుద్యోగమును వదలి శాంతిశ్రీ చింతతో ఎక్కడికో పోవును. విరక్తిరూపమున రక్తికై పరితపించు శాంతిశ్రీ కలలో కలగా, మానవసేవ చేయుగునని వెడలిపోయిన పద్మదేవుని ప్రయత్న ఫలముగాఁగాఁబోలు, ఆ సంఘారామమున్నచోట 'విశాల దివ్య నవ్యసాగర' మొకటి చూచినది. ఇట్లీ కథావస్తువు దీనముగా ధీరముగా నిలిచి పోయినది.

రక్తిలోను విరక్తిలోను సౌందర్య మున్నది. వికారముగూడ రెంటను గలదు. రెండును పరస్పర సంస్కారకములుగా పోషకములుగా ఉండఁగలవు; ఉండవలయును. ఈ తత్వమును గమనింపక పోవుటచేతనే మనదేశమందు

చార్వాకమతముతోఁ గూడ బౌద్ధమతమును నశించిపోయినవి. గురుదేవుఁడు పద్మదేవుఁడు ఇద్దఱును శుష్కహేతవాదులే. వీరిరువురి నడుమ పరవశముగా నలిగినది శాంతిశ్రీ. కాని కవికి పద్మదేవుని పక్షమున కొంత యభిమాన మెక్కువగా నున్నదని చదువరులకు తోఁపవచ్చును.

ఈ చిఱుకథలోని విభిన్న సందర్భములను. భావభేదములను ఎంతో సంయమముతో, మధుర భాషతో, రమణీయములైన భావనలతో చిత్రించినారు శ్రీ నారాయణరెడ్డిగారు. వారికి నా హార్దాభినందనములు. వారి భవిష్యత్కవితామతల్లికి నా అనంత మంగళాశాసనములు.

# ప్రస్తావన

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, ఎం. ఏ., పిహెచ్. డి.
(హైదరాబాదు ప్రభుత్వ ఆర్షశాఖాధ్యక్షులు)

నల్లగొండజిల్లా ఏలేశ్వరమునకు సమీపమున కృష్ణానది ఒకచిన్న కొండచుట్టును చీలి, రెండుపాయలై ప్రవహించుచున్నది. ఇచటికి సమీపముననే ఆనకట్టకట్టి పైరుపంటలకు వలసిన నీటిని ఒసగుటయేగాక, విద్యుచ్ఛక్తినికూడ ఉత్పత్తిచేయుటకు నిశ్చయించియున్నారు. ఆనకట్ట కట్టినపుడు ఇచట ఏర్పడు తటాకమునకు నాగార్జునసాగరమని సమీపముననున్న కొండపేరునుబట్టి నామకరణముచేసియున్నారు. ఈ కావ్యముపేరును కూడ అదియే కాని ఇందలి ఇతివృత్తము వేరు.

* * *

భారతీయవాస్తు, శిల్పసంపదయందు అనల్పభాగము నేడు నాగార్జునకొండయందు గాన్పించుచున్నది. ఈ కళాసంపద అమరావతి కళా సంప్రదాయమునకు చెందిన లోకోత్తరబౌద్ధమత శిల్పమునందు అగ్రస్థానము వహించినదనుటలో ఎట్టి అతిశయోక్తియు లేదు.

ఆంధ్రశాతవాహనసామ్రాజ్యము క్రీ. పూ. మూడవశతాబ్దమునుండి సుమారు ఐదువందల సంవత్సరములు మహావైభవముతో విలసిల్లి విదేశవ్యాపారమువలన ఆర్థికసంపదను అత్యధికముగ పెంపొందించి ఆంధ్రాభ్యుదయమునకు పునాదులు వేసియుండెను. ఆ మహాసామ్రాజ్యము పతనము చెందినపిదప ఆంధ్రదేశమున చిన్నచిన్న రాజ్యములు నెలకొనినందున

నాగార్జునకొండ పరిసరప్రాంతములందు ఇక్ష్వాకులనెడి ఒక చిన్న రాజ వంశము పరిపాలించుచుండెను. రాజ్యము చిన్నదైనను వాస్తు, శిల్పకళా పోషణయందేమి, విదేశయాత్రికులకు వీరొసగిన ఆదరాభిమానములందేమి ఇక్ష్వాకులు అసమాన ఖ్యాతి గాంచిరి.

"ఇక్ష్వాకు"లను పేరు హైందవులకును, బౌద్ధులకును కూడ పవిత్ర నామము. కాని ఈరాజవంశము యొక్క పుట్టు పూర్వోత్తరములను గూర్చి గాని, వారి చరిత్రను గూర్చిగాని ఎక్కువ విశేషములు తెలియ రావు. సిరిచాంతమూల, వీరపురిసదత్త, బాహుబల అను ముగ్గురు రాజుల పేర్లు మాత్రమే నేటికి విస్పష్టముగ ఈ రాజవంశమున గాన్పించుచున్నవి. ఈరాజులు స్వయముగా ఆజ్ఞాపించి వేయించిన శాసనములు ఇంతవరకును కానరాలేదు. కాని చాంతమూలుని ఇరువురు సోదరీమణులును, కూతురును కూడ బౌద్ధమతమునకు గొప్ప పోషణ యొసగిరని నేటికిని ఇచ్చోట గాన్పించు శిల్పశకలముల వలనను, ప్రాకృత శాసనముల వలనను విశద మగుచున్నది. చాంతమూలరాజుమాత్రము హిందూమతావలంబియై మహాసేనానుగ్రహము వడసి అశ్వమేధ, వాజపేయాది యాగములను గావించి తన హిందూమతాభిమానమును చాటి చెప్పుకొనెను. వీరపురిస దత్తుడు గాని అతని తనయుడు బాహుబలుడుగాని ఏమతమును అవలం బించిరో తెలియరాదు. వీరపురిసదత్తుని ప్రస్తావనగల శాసనములు ఒక్క నాగార్జునకొండయందేకాక అమరావతి, జగ్గయ్యపేట మొదలైన ప్రదే శములందు గాన్పించుచున్నవి. వీరపురిపదత్తుడు ఇరువది సంవత్సరము లును, బాహుబలుడు పదునొకండు సంవత్సరములును రాజ్యము చేసినట్లు తెలియుచున్నను వీరి కాలమునాటి చారిత్రక విశేషము లెక్కువగా తెలియరావు.

రాజులకన్న రాణివాస స్త్రీలకే మతవిషయము లందును, ధర్మ కార్యాచరణయందును ఎక్కువ శ్రద్ధ యుండినట్లు, ఇచటి శాసనములందు గాన్పించుచున్నది. హమ్మసిరిణిక, చాంతిసిరి, అడివి చాంతిసిరి, బాపి సిరిణిక, భట్టిదేవా, కోడబలిసిరి, బోధిసిరి మొదలగు పేర్లు శాసనములందు బౌద్ధమత పోషకులుగ గాన్పించుచున్నందున రాజవంశమువారేగాక సామాన్య స్త్రీజనముగూడ బౌద్ధమత పోషణకై యథాశక్తి ప్రయత్నము గావించిరని తెలియుచున్నది. వీరి ఔదార్యము వలననే ఇచటి మహా చేతియ, చేతియఘర, చతుస్సాల మొదలగు కట్టడములు నిర్మితము లాయెను. ఆదర్శప్రాయమగు వీరి చర్యను అనుసరించి ఇతర బౌద్ధ భక్తులు కులవిహారమును మరికొన్ని చేతియఘరములను నిర్మించిరి. ఇంకెన్ని నిర్మాణములు కాలగర్భమున విలీనమై పోయెనో!

ఇక్ష్వాకులనాటికి బౌద్ధమతము సమగ్రాభివృద్ధిగాంచి మనదేశము నందేగాక ఖండాంతరములందునుగూడ బాగుగవ్యాపించి, అసమాన మేధా సంపన్నుల అనవరత దీక్షాప్రయత్నములవలన శాఖోపశాఖలుగ విజృంభించి మానవ ప్రజ్ఞాపాటవమునకు ఉత్కృష్ట నిదర్శనముగ ఏర్పడెను. ప్రారంభ దశ నుండియుకూడ ఆంధ్రదేశమునందు (ముఖ్యముగ కృష్ణానది పరి సరములందు) బౌద్ధము సుస్థిరముగ నెలకొని వర్ధిల్లుచుండినందున తరువాతి కాలమున ఈ మతమున గాన్పించు అభివృద్ధి ఎక్కు వగ ఈ ప్రాంతమునందే గాన్పించుటలో ఆశ్చర్యములేదు. బౌద్ధమత ప్రవక్తలలో అగ్రేసరుడనదగు ఆచార్యనాగార్జునుడు ఈ ప్రాంతమునందే తన ఉత్తమ వ్యాసంగము గావించెననియు, విజయపురి యని ప్రసిద్ధి గాంచిన పట్టణప్రాంతమునకును, ఆ పట్టణమునకు సమీపముననున్న శ్రీపర్వతమునకును నాగార్జునకొండ యని సుప్రసిద్ధ నామము ఇతని

సాంగత్యమువలననే వచ్చినదనియు చరిత్రనుండి తెలియుచున్నది. ఈనాగార్జునుడు ఇక్ష్వాకువంశరాజులకన్న ఎన్ని సంవత్సరములుపూర్వపువాడో, ఈ ప్రాంతమునువదలి మగధయందలి నాలందా విశ్వవిద్యాలయమునకును టిబెట్ దేశమునకును ఎప్పుడు వెడలిపోయెనో తెలియరాదు. కొన్ని శతాబ్దులకు పిదప వెలసిన సిద్ధనాగార్జునుడే ఈ ప్రాంతమునకు ఈపేరు కలుగుటకు కారణ మాయెనేమోకూడ నిశ్చయముగ చెప్పజాలము. కాని శాసనములనుండియు ఇతరచారిత్రకాధారములనుండియుకూడ ఆంధ్రదేశమునందు బౌద్ధుల తత్త్వజిజ్ఞాసయు, గ్రంథరచనయు అసమానముగ విలసిల్లెనని మాత్రము స్పష్టముగ తెలియుచున్నది. నాగార్జునుడు ప్రతిపాదించిన మాధ్యమిక బౌద్ధమతశాఖ ఆంధ్రదేశముననే ఎక్కువ ప్రాముఖ్యతవహించెననియు, ఇటనుండియే, టిబెట్ మొదలగు విదేశములకు ఈమతమువ్యాపించెననియుకూడ చరిత్రనుండి తెలియుచున్నది. ఈ అంశములన్నియు జ్ఞప్తియందుంచుకొనియే శ్రీ నారాయణరెడ్డిగారు చారిత్రకాధారములగు శిల్పములను, శాసనములనుగూడ పరిశీలించి ఈ కావ్యరచనకు బూనుకొనిరి.

*　　　*　　　*

స్తూపములనియు, చైత్యశాలలనియు, విహారములనియు, బౌద్ధమత నిర్మాణములు మూడు తెరగుల గాన్పించుచున్నవి. తొలుదొల్త మట్టిదిబ్బగ నుండిన బౌద్ధ స్తూపము కాలక్రమముగ పరిణామము జెంది, అమరావతి అను అపరనామముగల ధాన్యకటకము నందలి స్తూపనిర్మాణము నాటికే పరిపూర్ణవికాసము నొందెను. నాగార్జునకొండ యందున్న పెద్ద స్తూపము 106 అడుగుల వ్యాసముగల బ్రహ్మాండమైన గుండ్రని కట్టడము. సుమారు 70 లేక 80 అడుగుల ఎత్తుగల దీని పైభాగము అర్ధగోళాకారముగనుండి దానిపైన పెట్టెవలె గాన్పించు హర్మిక, తదుపరి

ఛత్రదండ, ఛత్రములు ఉండెను. ఇటుకతోను మట్టితోను నిర్మించినను ఇచటగూడ అమరావతి యందువలెనే స్తూపముయొక్క ఉపరితలమంతయు 'ఆభాసశిల్ప' ఖచితమైన పాలరాతితో కప్పివేయబడి యుండెను. ఈ పైకప్పు రాళ్ళలో తీర్చిదిద్దిన శిల్పమే బుద్ధజీవితాంశములను, ఆమహాత్ముని పూర్వజన్మ వృత్తాంతములైన జాతక గాథలను 'కథాకథన' రూపముగ చిత్రించుచున్నవి. స్తూపము చుట్టును కటకటాలవలె నిర్మితమైన శిలామయ ప్రాకారముగూడ శిల్పమయమై యుండెను. శిథిలములైనను ఈశిల్ప శకలములనుండి యెన్నియో బౌద్ధగాథలు దృగ్గోచర మగుచున్నవి.

చైత్యశాలలనగా బౌద్ధభిక్షువులు తమ నిత్యనైమిత్తిక పూజాదిక ములను నిర్వర్తించుకొనుటకును, మతనాయకుని దివ్యబోధనల నాలకించు టకును, మతగ్రంథపఠనగావించుకొనుటకును సమావేశమగుటకు వీలుండు నట్లు నిర్మించిన విశాలమైనశాలలు. వీనియందును, ఈ భిక్షువులు నివ సించు 'విహారము' లనబడు మందిరములందునుగూడ ఎటుచూచినను పవిత్రబుద్ధ జీవితగాథలను చిత్రించి శిల్పి ఒకపవిత్రవాతావరణమును సృష్టిం చెను. శిల్పము, వాస్తువిశేషములు, వర్ణచిత్రములు మూడును శ్రుతిమేళ వించినగాని సమగ్రత రాజాలదను నాటి సంప్రదాయమువలన నాగార్జున కొండయందు చిత్రకళకూడ వికసించియుండెననుటకు కొంత ఆధారము కలదు.

ఈ కళాసామగ్రిని జాగ్రత్తగ పరిశీలించియే శ్రీ నారాయణరెడ్డి గారు తమ కావ్యమునందు పద్మదేవుడు ఏయే బౌద్ధగాథలను చిత్రించెనో వర్ణించిరి. పద్మదేవుడు కల్పితపురుషుడేగాని, అతడు నిర్మించెనని వర్ణిం చిన శిల్పములన్నియు నాగార్జునకొండయందు దొరకిన ప్రాచీనశిల్పములే.

* * *

'సత్యం శివం సుందరం' అను మూడు ఆశయములును అవినాభావ సంబంధముతో నుండుననియు అనాదిగ విశ్వసించిన భారతీయ శిల్పికి ఈ పవిత్ర కార్యనిర్వహణయందు సౌందర్యోపాసనచేయుటకు ఎంతయో అవకాశము దొరకుచుండెను. ఇట్టి అవకాశమును పురస్కరించుకొని సౌందర్యసృష్టికి బూనుకొని తన్మయతజెందిన శిల్పి, అప్పుడప్పుడు తన పరమలక్ష్యమును మరచిపోయి తాత్కాలికమగు చిత్తక్షోభకు లోనై ఇంద్రియలౌల్యమునదిగజారిపోవుటయుగూడ సంభవింపవచ్చునని శ్రీ నారాయణరెడ్డిగారు తమ 'అజంతాసుందరి' కావ్యమున ఇదివరకే నిరూపించిరి. 'బలవాన్ ఇంద్రియగ్రామో, విద్వాంస మపి కర్షతి'

ఈ గ్రంథమున శ్రీ నారాయణరెడ్డిగారి భావజాలము ఇంకా వికసించి ఒక అపూర్వరూపమును దాల్చుచున్నది. కళకును, ఇంద్రియ సుఖములకును, సన్నిహిత సంబంధమున్నది. కాని ఇంద్రియములను జయించినగాని నిర్వాణసుఖము నపేక్షింపవీలులేదు. కాబట్టి శిల్పాది కళోపాసకుల కళాప్రపంచమునకును, భిక్షు భిక్షుణీపరిసేవ్యమానమగు బోధిసత్త్వ ప్రపంచమునకును ఎట్టి సంబంధమునులేదు: పైగా కళోపాసన సన్మార్గావలంబనకు ఒక ప్రతిబంధకమేమో ! ఈ స్వభావములు కొంతవరకు ఈ కావ్యమును చదివిన స్ఫురించకతప్పదు.

ఈ కావ్యమునందలి ప్రధాన పాత్రలు పద్మదేవుడు, శాంతిశ్రీ, సంఘారామాధ్యక్షుడు. పద్మదేవుడు శిల్పి : సౌందర్య పిపాసయే ఉత్తమ మతముగ భావించి తన్మయత జెందిన కళోపాసకుడు, ధీరలలితుడు. ఇచటి సంఘారామమునందు అధ్యక్ష స్థానము నలంకరించిన మతాచార్యుడు కేవలము తత్త్వశాస్త్రవేత్తయేగాక బౌద్ధమత ప్రబోధమునందు అకుంఠిత దీక్షగలవాడు. మతమునకై ఎట్టి త్యాగమునైనను జేయుటకు

వెనుదీయని ఈ ధర్మతత్పరుడు కళాపోషణకు అంతరాయము కలిగినను, సంఘారామము శిల్ప, చిత్రకళా సౌందర్యమును గోల్పోయినను కూడ లెక్కపెట్టని ధీరోదాత్తుడు. వీరిరువురి ప్రభావమునకును లోనై ఒకవైపు కళయు, మరియొకవైపు మతమును ఈరెండును మనసును కలవరపెట్టు చుండ, చిత్తక్షోభయందు కన్నుమిన్ను గానక, ఆవేదనతో బాధపడు చుండిన ముగ్ధ, శాంతిశ్రీ, చివరకు మతాచార్యుని క్రమశిక్షణకులోనై అతడు నిర్దేశించిన పథము నతిక్రమించలేక తాను వలచిన పద్మదేవుని తన కభిమతమైన కళనుగూడ పరిత్యజించి సన్యాసిని యాయెను. అప్పటి కిని గూడ ఆశ్రమాంతర వాసన తొలగిపోనందున కలలుగనుచు పద్మ దేవుని పాదారవింద స్పర్శ కొరకు చేతులు చాచును. అతనికై కన్నీరు గార్చి దుఃఖసాగరమును సృష్టించుకొను చున్నది. దుఃఖ నివృత్తియగు పరినిర్వాణమునకు ఇంకను ఎన్నిజన్మ లెత్తవలసి యుండెనో !

*   *   *

నారాయణరెడ్డిగారి కావ్యము తెనుగునందున్న ఉత్తమ చారిత్రక కావ్యములలో నొకటియని నిస్సందేహముగ జెప్పవచ్చును. ఈవిధముగ వారు చరిత్ర కొనర్చిన సేవ, పాశ్చాత్య దేశములందు షేక్సుపియరు మొదలగు రచయితల మహాకావ్యములను జ్ఞప్తికి తెచ్చుచున్నది.

ఆనకట్టవలన నాగార్జునకొండ మునిగిపోవుచున్నదే అని విచార పడ నవసరములేదు. శ్రీ నారాయణరెడ్డిగారు నాగార్జునకొండకు ఒక శాశ్వతకీర్తికాయము సృష్టించియున్నారు.



ఈ కావ్యం ఇంతత్వరలో వెలుగు లోనికి రావడానికి కారకులు, సరసులు, సాహితీ బంధువులు శ్రీ కపిల కాశీ పతిగారు.

లఘుకావ్యానికి విపుల పీఠికలు సమ కూర్చినారు, విద్వన్మణులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, డా. పుట్టపర్తి శ్రీని వాసాచార్యులుగారు.

కావ్యరచనకుపూర్వం కథాకల్పనలో విలువైన సలహాలిచ్చినారు మిత్రులు శ్రీ డి. రామలింగంగారు.

కావ్యం ఆమూలాగ్రంవిని అక్క డక్కడ చక్కనిసూచనలు చేసినారు సుహృ న్మణులు శ్రీ దాశరథిగారు, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు.

కావ్యమును ప్రచురించినారు తెలం గాణా రచయితల సంఘంవారు.

ముచ్చటైన ముఖచిత్రం వేసినారు చిత్రకారులు శ్రీ వెంబుగారు. ముద్దుగా ముద్రణ జరిపినారు అజంతా ప్రింటర్సు వారు.

వీరికి నాహార్దిక కృతజ్ఞతలు.

— నారాయణరెడ్డి

# ప్రథమ తరంగం

ఇక్ష్వాకు వంశక్షి
తీంద్ర చంద్రుల కీర్తి
కౌముదులు నల్గడల
కలయ విరిసిన నాడు
కృష్ణవేణీ తరం
గిణీ పయః కింకిణులు
త్రిశరణ క్వాణాల
దెసల నింపిననాడు
శ్రీ పర్వతాగ్రమ్ము
సింహళాగత బౌద్ధ
భిక్షువుల విజ్ఞాన
పీఠకమ్మగు నాడు
సిద్ధార్థుని విశుద్ధ

సిద్ధాంత బీజములు
శాఖోప శాఖలై
సాగి పోయిననాడు
నేను జీవించి యు
న్నానంచు భావించి
పలికింతు గేయ కా
వ్యమును హృదయము పెంచి.

*

అదిగొ కృష్ణమ్మ న
వ్యాప్సరోంగన భంగి
నడయాడె నాంధ్ర భూ
నందనోద్యానమున.
అల్లదుగొ కృష్ణవే
ణమ్మ విద్రావ రూ
పము దాల్చినట్టి బౌ
ద్ధమువోలె కదలాడె.
ఆమె ఒకసారి మన
సార పొంగినచాలు
ఈనాడు క్రుంగిపో
యిన శాతవాహనుల

వైభవోన్నతి మిన్ను
వాక తరగలదాకు.
ఆమె ఒకమారు నో
రార పల్కిన చాలు
పదివేల కిన్నరులు
పదివేల కిన్నెరల
హృదయ తంత్రికల మ్రో
యించినటు లనిపించు.
ఆమె ఒక పర్యాయ
మదరిపోయిన చాలు
అమరావతీ మంది
రాంతర శిలాశయ్యా
లందు నిద్దురలేచు
అప్సరో భామినుల
మెయివిరుపులే తోచు
హొయలు మెరుపులు వీచు.
ఆమె కన్బొమల కెన
యైన చాపము లేదు
ఆమె తరగలు పొంద
నట్టి రూపము లేదు.

జ్యోత్స్నాభిసారికల
సుమనోజ్ఞ వసనాంచ
లములు సన్నని గాడ్పు
లకు చలించిన యటుల;
శరదంబరమున పిం
జలు పింజలుగ వీడ్రి
మెల్ల మెల్లగ సాగు
మేఘమాలిక లటుల;
ఆమె కెరటాలు చి
త్రాతి చిత్రములైన
గతులతో పయనించు
కవితలే యనిపించు.
బోధిసత్త్వుని మూర్ధ
మును సదా పరివేష్ట
నము సేయు దుర్నిరీ
క్ష్య మహోలహరులట్లు;
శాక్యర్షి కడకంటి
చాయలందున వెల్లు
వలుదూకు కరుణార్ద్రి
లలిత భావనలట్లు;

ఆమె కెరటాలు ది
వ్యాతి దివ్యములైన
రూపురేకల దాల్చు
చూపుకందక నిల్చు.
ఆమె యొడిలోన ని
ద్రావస్థలో నున్న
శిశువుల విధాన ప
చ్చిక బయళ్లొప్పారు.
ఆమె దక్షిణ హస్త
మందికొని పవళించు
శ్రీ పర్వతుండు రా
శీభూత సహనుండు.
నాగార్జునుని పద
న్యాసమాత్రముచేత
శ్రీ పర్వతుడు వెన్నె
లై పోయి విలసించె.
నాగార్జునుని బోధ
నా సుధాధునిలోన
శ్రీ పర్వతుడు వెన్న
యైపోయి వికసించె.

నాగార్జునుని మేధ
లో గట్లు తెగిపారు
విజ్ఞానము రసాయ
న జ్ఞానమై పొంగె.
నాగార్జునుడు చూపి
నట్టి నూత్నపథమ్మ్ము
బౌద్ధమత సౌధ సం
ప్రాప్తి సోపానమ్ము.
నాగార్జునునిపట్ల
ననలెత్తు భక్తి సం
భ్రమములో తనపేరు
మరచె శ్రీ పర్వతుడు.
మరచి శ్రీ పర్వతుడు
మలచుకొనె తనుతాను
నాగార్జునుని పేర
నవవైభవము మీర.

*

ఆ నాగార్జున గిరీంద్ర
మంతకంత కలరారెను

బౌద్ధజీవన ప్రతిబిం
బద్యోతక దర్పణమై.
ఒకవైపున వెలసెను వి
శ్వకల్యాణ పథసూచిక
ఉన్నత విద్యా పీఠిక
సన్నయ లతికా వాటిక.
మరియొకవైపున లేచెను
మహిత చైత్య మందిరములు
సంఘారామము లెన్నో
చక్కని స్తూపము లెన్నో.
అఖిల బౌద్ధ నిర్మాణము
లందు అందెవేసినట్టి
'మహాచైత్య' నిర్మాణ
మ్మహర్నిశలు సాగుచుండె.
'బుద్ధధాతువు' ను తనలో
పొదిగిన స్వర్ణ కరండము
పైన 'మహాచైత్య' రచన
ప్రశస్తముగ సాగుచుండె.
అండాకృతి గల్గిన చై
త్యాననమ్ము పరికించగ

అచ్ఛముగా ధర్మచక్ర
మచ్చొత్తిన యటుల దోచు.
కళాతపస్వుల ఉలి్ట్రతు
ప్పుల డుల్చిన చైత్యరాజ
మగుపించెను మహాబుద్ధ్యా
నంతర శౌద్ధోదనివలె.
జినదేవుని నొక్కులువా
రిన నీలాలకలవోలె
స్తూపవేదికల సాగెను
సుందర శిల్పలతావళి.
చైత్యోపరి శిలాఫలక
జాలమ్మున నిదురించెడు
కళాత్మలను ఉలితో మే
ల్కొలిపెనదో యువకు డొకడు.
ఆతడు సామాన్య మనుజు
డైన నమరకళ నజుండు
ఆంధ్రు డతడు అంతియ కా
దనంత విశ్వాత్మజుండు.
అతడు పద్మదేవు డనెడు
అభిధచేత మించువాడు

అతడు కళాత్మకజీవన
మభ్యాసము జేసినాడు.
అతనికి ప్రాంతపుటెల్లలు
అక్షిగోచరములు కావు
అతనికి మతవైషమ్యము
లణుమాత్రము తెలియరావు.
అతని హృదయ మనల్పము
అతడు సజీవ శిల్పమ్ము.
అతడు మానవుని రూపము
నందికొన్న గాంధర్వము.
కఠినశిలల నవనీతము
గా మార్చెడు తాంత్రికుండు
విషధరముల తలలూపెడు
రసవత్తర మాంత్రికుండు.
ఆతని కలలే కళలై
ఆకారము దిద్దికొనుచు
'మహాచైత్య' కుడ్యమ్ముల
పై హల్లీసకమాడెను.
నిస్తరంగ నీరాకర
నిర్విష్టాంభోజ మట్లు

నిగూఢ నిర్లిప్తభావ
నిష్ఠిత మాతని ముఖమ్ము.
బంభర పక్ష్మాంచలముల
స్తంభింపగజేయు నతని
కోరమీసముల దాగును
దోరనవ్వు తెరల సిరులు.
మకరాంకుని చికిలివారు
మార్గణ గణములసైతము
మారొడ్డి జయించు నతని
మహితోరః కవాటమ్ము.
అతని శిరోజమ్ములతో
ప్రతిస్పర్ధ చేయలేక
వర్షాబ్దమ్ములు శిరాలు
వంచి కంట నీరునించు.
అతని తనువు సుందరమ్ము
అతని మనసు సుందరమ్ము
అతనికి కన్పించును ప్ర
త్యణువున నొక సురపురమ్ము.

ఆ పద్మదేవుడు 'మ
హాచైత్య' మునకు న
ల్కెలకులందున శిల్ప
కళికలను మొలిపించి
నాగార్జున గిరీంద్ర
భాగమును వెలిగించె
ఒక అజంతా కందరముగా
ఒక ఎలోరా మందిరముగా.
బుద్ధభగవానుని స
మిద్ధ బోధాంకురము
లతడు తాకిన రాళ్ళ
యందు రేకులువిప్పె
వివిధ వర్ణానురక్తములై
విమల భావాభిషిక్తములై.

*

తమ సద్మమైన 'తుషి
తస్వర్గము'న మూడు
కోట్ల అమృతాంధసులు
కుంచిత కరాబ్జులై

బుద్ధదేవుని కెరగి
"భూలోకమున గాయ
పడినట్టి మానవ
త్వమున కాయువుబోయ
జన్మ మెత్తుడు మీర"లంచు
ప్రార్థించు
జాతిచిత్రము కనులనించు.

జనని మాయాదేవి
స్వప్నలోకమునందు
శరదంబుధరముతో
సరివచ్చు కరిరూపు
ధరియించి అంబరాం
తరవీధుల మహోవ
తరణమ్ము సేయు బుద్ధుండు
తరళ చి
త్తములన్ సదా నిల్పుచుండు.

లుంబినీవన మధ్య
లలిత సాలక్షితిజ

శాఖావలంబనము
సలుపు మాయాదేవి
కడుపు చల్లగ పుడమి
బడి ఏడడుగులు మున్
నడిచి బుద్ధస్వామి నిలిచె
అతని ప్రతి
అడుగులో అబ్జమ్ము మొలిచె.

తనతండ్రి చేయబూ
నిన మహానందోత్స
వమున నృపకన్యకల
వరుసగా పిల్చి కా
న్కలు సమర్పణసేయు
గౌతముని కట్టెదుట
ధమ్మిల్ల విజితాంబు
ధర యశోధర నిల్వ
అతనిలో కదలు చంచలలు
శిలలందు
ఆకారమును దాల్చు కలలు.

నిస్సార సంసార
నీరాకరము దాట
నౌకా గవేషణ
మ్మె కాంక్షగా నున్న
గౌతముని ఐహికసు
ఖప్రసక్తుని జేయ
ఒక కాంత పుష్పవ
ల్లికలను కవుగిలించ;
ఒక రాగిణి మధుపా
త్రిక పెదవి చుంబించ;
కటిదఘ్నమగు జలా
కరమందు నిల్చి కొం
దరు సుందరీమణులు
నవ్వుతుంపర విసర;
నిర్వాత దీపమటు
నిలుచు బుద్ధుని ముఖ
మ్మున నున్న నిశ్చలతజూచి
కరిరాళ్లు
పులకించె గుండియలు పూచి.

తన పరీరంభణ
మ్మున వేల స్వర్గాలు
నిర్మించుకొనెడు ప్రా
ణేశ్వరీ బాహువ
ల్లికల నల్లన వాపి
లేచి దిక్కులు సూచి
అర్ధాంగివైపు చి
న్నారి కొమరునివైపు
పరుగెత్తు వ్యామోహ
పాశముల తెగద్రెంచి
పుల్కపుల్కన సౌధ
ములు గన 'మహాభిని
ష్క్రమణమ్ము' సేయు బుద్ధుండు
విశ్వరం
గమునం దదృష్టపూర్వుండు.

పరిపూర్ణ సంబుద్ధి
ప్రాప్తించుటకు బోధి
వసుధారుహము క్రింద
'వజ్రాసన' స్థుడౌ

బుద్ధుని తపోనిష్ఠ
బూది పాలొనరించ
మారు డొనరించు ఘో
రారభటి ధరియించి
అతని మూవు రసుంగు
సుతల మదన వికార
చేష్టాదికముల కిం
చిన్మాత్రముగ నెంచి
ఇష్ట నిష్ఠాసిద్ధి పొందు
సిద్ధార్థు
డెనలేని తేజమ్ము చిందు.

బాల్య కాలమునుండి
పాలిపగతో త్రాచు
పామువలె తనవెంట
బడు దేవదత్తుండు
విడిచిన మదగజమ్ము
వీథిగత ప్రజల
చెల్లాచెదరు జేసి
పెల్లుఘీంకృతులతో

బుద్ధుని సమీపించి
మూర్ధమును కడువంచి
కరముతో పదధూళి
శిరముపై జల్లికొని
సాష్టాంగముగ నమ
స్కారమ్ము నొనరించు
మహనీయమైన దృశ్యమ్ము
అతిలోక
మహిమాన్విత మ్మవశ్యమ్ము.

సలిలమొక కంట ప
చ్చని చిచ్చు వేరింట
విలసిల్లు బుద్ధ మం
గళమూర్తి వర్తనలు
అతని జాతక గాథలు—
అతడు సంసరణ సం
గతి విముక్తిని పొంద
ననుభవించిన బాధలు—
అన్ని యాకృతులతో
అవతరించెను పద్మ

దేవుని కళాజగతియందు
అతడు చి
త్రించనిది కనుపించదెందు.
అతడు చెక్కిన కళా
న్వితఖండముల జూడ
అరుగుదెంచిరి విదే
శ రసజ్ఞ శేఖరులు.
అతడెల్లపుడు కల్ప
నావస్థలో నుండు
అతని సుత్తియ అనా
రతము మ్రోగుచునుండు.

*

ఒకనాటి మాట ప
ద్మకళాత్ముడు యశోధ
రా గౌతముల మృదు
ప్రణయ ఘట్టమ్ము చి
త్రముగవేయుచు నవర
తాదాత్మ్యమున నుండ
గాలిలో చిరుతరం
గాల డోలలు వీచె.

అల్లంత దూరాన
అంగనామణి దోచె.
కదలివచ్చిన మల్లి
కావల్లిక యనంగ
అవయవమ్ములు దాల్చి
నట్టి అమృత మనంగ
మదన సమ్రాడ్ధను
ర్మర్యాదలను దాట
వెనుకముందాడు క్రొ
వ్విరి మార్గణ మనంగ
ఆమె రూపము పరిమ
ళాత్మక మ్మనిపించు.
ఆమె నడిచిన హంస
లనవసర మనిపించు.
ఆమె అల్లన సాగె
అమె మెల్లన సాగె
అల్లనల్లన గుండె
జల్లు జల్లనసాగె
మెల్లమెల్లన మనసు
పల్లవించగసాగె

అల్లనల్లన సాగె
మెల్లమెల్లన సాగె
అతనికి సరిగ నొక్క
అడుగు దూర మ్మాగె.
అతడు కుడ్యమునకే
అభిముఖుండై యుండె
అతని చూపులు చిత్ర
మందు మాత్రము నిండె.
ఆమె అతనిని మాట
లాడించ రాలేదు.
ఆమె చిత్రాలు చూ
డక తిరిగిపోలేదు.
అతని దృష్టి మరల్చ
నామె చేతికి రత్న
కంకణమ్ములు లేవు
కాళ్ల కందెలులేవు
పల్కరించగ నాల్క
పై మాటలే రావు.
ఆమె ముగ్ధత్వమ్ము
నరసి జాలివహించి

గాలిదేవర లతా
గ్రముల నల్లన ద్రోసె
ఆమె చేలాంచల
మ్మలల పోలిక లేచె
పద్మదేవుని హృదిని
పరిమళమ్ములు వీచె
పద్మదేవుని కెదియొ
స్పర్శించినటు తోచె.
తలను వెన్కకు ద్రిప్పి
తిలకించె నతడు చం
చలవంటి దొరవె
న్నెలవంటి రూపమ్ము.
ఆమె దర్శించె నిట
లాంబ రాంచలమందు
ముంగురుల మేఘాలు
ముసురుకొను రూపమ్ము.
అతని కుంచియ చేతి
యంచులను దిగజారె
నో లేదా ఆమె నే
త్రాల జ్యోత్స్నకలూరె.

ఎన్నో అజంతలు మ
రెన్నో అమరావతులు
వరుసగావారి ముం
దర వాలి తమ దివ్య
సౌందర్యరుచుల వెద
జల్లె నా సమయమున.
క్షణమాత్ర మట్టి స్వ
ర్గస్థాయిలో దేలి
వారిర్వురు యథా ప్ర
పంచమున దిగివచ్చి
తామంత సాన్నిహి
త్యమునందిన విచిత్ర
ఘటన కాశ్చర్య సం
కలిత చేతసులైరి.
పద్మదేవుడు కుంచె
పాణి పల్లవమందు
ధరియించి వేరు చి
త్తరువు వేయగసాగె.
గౌతమ యశోధరల
క్రమ ప్రణయదృశ్య

మునుజూచి ఆమె ని
ల్చెను చిత్తరువు పోల్కి.
పద్మదేవుడు తానె
పల్కరించగ నెంచి
'మీరలెవరో' యంచు
మెల్లగా ప్రశ్నించె.
ఆమె చిత్రార్పిత
మ్మగు తన్మయతనుండి
తేరుకొని పల్కె 'శాం
తిశ్రీ' యనెడు మాట.
ఆమె పల్కిన యంత
ఆగిపోవగ దొడగె
పద్మదేవుని పాణి
పద్మమందలి కుంచె.
అమె యొకనుడి కప్ర
మటుల చల్లందనము
నాతని యెడందలో
ఆసేచనము జేసె.
ఆమె వాక్కులు తిరిగి
ఆలకించగ నుత్స

హించి పద్మాహ్వాయుడు
పెంచె సంభాషణము.
సుర తరంగిణిలోని
నురుగులను పురుడించు
చిన్నారి నుడుల ని
చ్చెను సమాధానమ్ము.
"నాగార్జునుడు నిల్పి
నట్టి విశ్రుత విశ్వ
విద్యాలయములోన
విద్యార్థినిగ నేను
బౌద్ధ పాఠమ్ము ల
భ్యాసమ్ము జేతు" నని.
ఆమె మాటలలోని
అర్థమ్ము జూచియో
ఆమె కంఠస్వరపు
టందమ్ము జూచియో
అత డీషదంకురిత
హాసాననుండయ్యె.
ఆమె చెక్కిళ్లు ల
జ్జారుణములై పోయె.

అత డందుకొనెను ర
వ్వంత గొంతుక నెత్తి
"మతపాకములు దప్ప
ఇతరాంశములు మీకు
ఆస్వాదనీయమ్ము
లైనట్లు కన్పడవు.
అయినచో నొకమాట
నడుగ ధైర్యముసేతు
రాతి బొమ్మలు మిమ్ము
రంజింపజేయు నెటు?"
అతని ప్రశ్నకు నామె
ఆవంత కదలలే;
దైన నామె ముఖాన
వానమబ్బులు ముసిరి
కరగిపోయిన శుభ్ర
కాంతి దొంతరలాడె.
"ఏ మహాత్ముని బోధ
యే మాకు వేదమో
ఏ మహాత్ముని ధ్యాన
మే మాకు ప్రాణమో

ఆ మహాత్ముని బ్రతుకు
సంత త్వాదృశులు శి
ల్ప కళామనోజ్ఞ రూ
పముల చిత్రించినా ;
రందుకే మాకు కళ
లాస్వాదనీయములు.
అందుకే మాకు కళ
లారాధనీయములు."
ఆమె ప్రతివచనమున
కతడు సస్మితుడయ్యె.
ఆమె మత సంరక్తి
కతడు విస్మితుడయ్యె.
అతడు మాటాడలేదు-
ఆమె మాటాడలేదు-
అతడు మాటాడలే
దామె మాటాడలే
దిరువురికి నడుమ ఘటి
యిల్లె నొక సంజతెర.
వార లుభయులు నిపుడు
దూర దూరములందు

కానుపించిరి నడుమ
కడ సంజ కడలుకొనె.
బౌద్ధభిక్షు ప్రజా
బద్ధ కాషాయ వ
స్త్రముల వన్నెలు దిశాం
తముల రెపరెపలాడె.
చిన్మయాత్మలను వం
చించనెంచెడు క్షుద్ర
భోగములవలె తమ
మ్ములు లోకముల గ్రమ్మె.
నాగార్జునాద్రి సం
ధ్యా గర్భమున దాగె
త్రిశరణధ్వనులు న
ల్దెస లద్రువగా మ్రోగె.



# ద్వితీయతరంగం

ఒక మహాత్ముని మాన
సిక నిగ్రహణశక్తి
కెదురొడ్డి పారు లౌ
కిక కామనలవోలె
రాత్రి సొంతము గుప్త
రశ్మితో పోరాడి
చీకటులు పర్వుదీ
సెను దిగంతాలబడి.
ఒక మహాజ్ఞాని మౌ
ళిక వికాసము జూపు
వేళ రేకులు విప్పు
విమలభావన భంగి
ప్రాచీదిగంగనా

ఫాలరంగముపైన
కుసుమించె స్వచ్ఛ కుం
కుమ కాంతి గుచ్ఛమ్ము.
నల్దెసల పక్షి సం
తానమ్ము లెవియొ వ్యా
ఖ్యల కందలేని శ్లో
కమ్ములను విన్పించె.
కృష్ణవేణీ తరం
గిణీ పయోలహరికా
స్నాతుడై పవనుడు పు
నీతుడై చలియించె.
బౌద్ధ భిక్షువుల ప్రా
భాత పూజాగీతి
కాస్వరమ్ములు శైల
కందరమ్ముల మ్రోగె.
అది సుప్రభాత ; మ
య్యదను జూచి వసంత
లక్ష్మి తొలిపాద మ
ల్లనవేసె లోకాన.

ఋతువులందు వసంత
మతిలోక సుందరము
గడియలందు ప్రభాత
ఘటికయే మంజులము.
ఆ వసంతమ్ము మరి
యా ప్రభాత మ్మొక్క
గడియలోనే జగతి
నిడెను పాదయుగమ్ము.
ఆ వసంత ప్రభా
తాముల్యా సంధ్యలో
నిదుర తెరనుండి శాం
తిశ్రీ విదల్చికొని
కనుదమ్ములను విప్పి
వెనువెంటనే లేచి
చలియించి కృష్ణలో
సలిలావగాహనము
సలిపి, పెన్నెఱిగుంపు
సన్నగా విడదీసి
తడియార్చి కటిపైన
బడునట్లు విరబోసి

మల్లికాసిత నవాం
బర ధారణముచేసి
బాలభాస్కరుని కెం
గేలి తాకిడుల నో
పక కిలాకిల నవ్వు
వికచాబ్జముల దూసి
పద్మదేవుని కళా
సద్మాభివదనయై
నడచె శాంతిశ్రీ మ
నఃప్రసన్నత దోప.
భానుదేవుని మొదటి
బంగారు కిరణమ్ము
పడతి రూపును దాల్చి
నడువనేర్చె ననంగ
ఆమె అత్యంత శో
భాదీప్తయై నడిచె.
ఆమె పద్మాహ్వాయుని
ఆలయమ్మును దరిసె.

అచట పద్మదేవు డంత
రాంతరములనున్న అంతి
మ కళామందిరమున ని
ద్రకు వశుడై వాలియుండె.
లోకము నిద్రానిలయ
ప్రాకారమ్ములను దూక
ఆతడు నిద్రాళువగుట
ఆశ్చర్యోత్పాదకమ్ము.
ఆతడు గతరాత్రి రెప్ప
లార్పక మేల్కొనెనేమొ
అతని కల్పనలు మధురా
కృతుల నారువోసెనేమొ.
అతడు రాతి సెజ్జపైన
అనంత సుఖనిద్ర పొందె
అతని చేతిలో తూలిక
హాయిగ కలగాంచుచుండె.
భిత్తికపై మేలుకొన్న
చిత్తరువున తడియారని
రంగులె సాక్ష్యము లాతడు
రాత్రి మేలుకొనియుంటకు.

తడియారని కన్నుల చి
త్రగతాంభోజాత నేత్ర
సుప్త పద్మ దేవునినే
చూచినట్టు లనిపించును.
ఆమె శిల్పచిత్రస్థితి
నందిన గంధర్వాంగన
యందుమ ? కనురెప్ప లప్పు
డప్పు దార్పినట్లు తోచు.
అతని ముఖమ్మున నిద్రా
గత చిహ్నము లేవి లేవు.
అయిన నతడు ప్రగాఢ సు
ప్త్యవస్థలో నున్నవాడు.
అతడు కనులుమూసి ఆమె
కభిముఖముగ నిద్రించెను.
అతడు స్వప్నమందు ఆమె
కడ్డముగా నిల్చుండెను.
అతడు కనులుమూసినాడు
ఆమె అతని కభిముఖియే.
అతడు కనులు విప్పినాడు
ఆమె అతని కభిముఖియే.

అతడు రెప్పలల్లార్చెను
ఆమె యెదురుగా నిల్చెను.
అతడు చూపులను నిల్పెను
ఆమె యెదురుగా నిల్చెను.
ఆమె భిత్తిపై దృష్టుల
నాన్చి యట్టె నిల్చుండెను.
ఆమె మరల తన్ను తాను
అంగాంగములను జూచెను.
ఆమె కురంగాక్షియయ్యె
ఆమె చంచలాంగియయ్యె
ఆమె భిత్తి చిత్రమువలె
అంతట నిస్తబ్ధయయ్యె.
అత డప్పుడు కించిల్ల
జ్జావనత నిటాలుడయ్యె
అతనికి గతరాత్రీ చి
త్రాకల్పన స్ఫురణయయ్యె.
దిగ్గునలేచి "అహో! శాం
తిశ్రీ మీరలా" యంచు
సిగ్గుపడుచు పల్కి వచిం
చెను శాంతిశ్రీ యిట్టుల.

"మేమా శాంతిశ్రీలము
మీర లెంత వింతవారు!
అదుగో శాంతిశ్రీ కు
డ్యమున నిల్పినారు మీరు.
శాంతిశ్రీగూడ బౌద్ధ
జాతక కథలకు జెందిన
కాంతయె దయతో మీరీ
వింత నాకెఱింగించుడు."
అపుడు పద్మదేవు డిట్టు
లనియె నామె వ్యంగ్యాత్మక
వచః ప్రఘాతమున కించు
క చలించియు నెప్పటివలె.
"సజీవముగ కన్పించెడు
శాంతిశ్రీ యెదుటనుండ
జాతక గాథలలోపలి
జలజాక్షిని వెదకనేల?
చిత్రగతమ్మగు శాంతి
శ్రీతో మాట్లాడుచుంటి
జీవశిల్పమగు శాంతి
శ్రీ నిప్పుడు యెదుటగంటి

ఇది చిత్రముగాదా" యని
ఇంకేమో అనబోవగ
శాంతిశ్రీ గాంభీర్యము
సంతరించుకొని యిట్లనె.
"పూజనీయుడైన బుద్ధ
మునీంద్రు జాతకగాథలు
చిరస్మరణ యోగ్యములుగ
జేయుట మీ కర్తవ్యము.
ఆ మహాత్ముని అపూర్వ మ
హో మహిమల వర్ణింపుడు
మాదృశులను చిత్రించుట
మర్యాదయె కళాత్ములకు ?
నన్నుబోలు క్షుద్ర జీవ
న భాజనులను చిత్రించి
శిల్పకళకు మచ్చ కల్గ
జేసినారు మీర లయో!"
శాంతిశ్రీ సంతప్త హృ
దంతరమును గుర్తువట్టి
వర్షాంభోద స్వరమున
పల్కెను పద్మదేవుండు.

"అయ్యయ్యో మీరలెంత
అమాయికలుగా నుంటిరి
మతముదప్ప వేరే జీ
విత పథమ్ము లేదంటిరి.
మతమే ప్రతివారికి జీ
విత సర్వస్వమ్ముకాదు.
మతబంధ మ్మింత లేని
మహామహులు లేరెందరు ?
మతబోధలకే కళ లం
కితముసేయు టెందులకో ?
సౌందర్యమునకు మతమున
స్థానము లేదెందులకో ?
నేను బౌద్ధమతయాయిని
కా; నైనను నాదు కళా
జీవితమ్ము బుద్ధమూర్తి
చిత్రణకే యంకితమ్ము."
"అట్లులైన మీరు బౌద్ధు
లగుటకు సందియమ్మేమి"
అని విస్ఫారిత నేత్రము
లార్చుచు అర్ధోక్తిలోన

అందుకొనెను శాంతిశ్రీ
డెందము నాపంగలేక.
పద్మదేవుడంత తన ఉ
పన్యాసము సాగించెను
శాంతిశ్రీ బేలతనము
జాలి కల్గజేయుచుండ.
"నేను బౌద్ధుడనని మీరు
నిర్విచారముగ నంటిరి
కాని మతాచార్యుల దృ
క్కోణమ్ములు భిన్నమ్ములు.
నేను ముండిత శిరస్కుడ
గాను; కాను కాషాయాం
బర ధారిని; కాలేను త్రి
శరణమ్ములు వల్లించెడు
సన్యస్తాఖిలభోగుడ.
కాన నేను బౌద్ధుండను
గానుసుమీ ఆచార్యులు
నన్ను కళాస్రష్టగనే
మన్నన సేయుచునుందురు.

కరుణామయుడగు బుద్ధుని
గాథ లన్ని మాదృష్టికి
కళాఖండముల రూప
మ్ములలో కన్పించుచుండు.
ప్రకృతిలోని ప్రత్యణువున
పరమాద్భుత శోభాన్విత
సౌందర్యము నిర్లిప్త
స్థాయిలోన నిద్రించును.
నిద్రిత సౌందర్యము ను
న్మిషితమొనర్చును సుత్తియ,
నిగూఢ సుందరతను వ
ర్ణితమొనరించును కుంచియ.
సౌందర్యమె మాదు కళా
మందిర మూలస్తంభము
సౌందర్యాన్వేషణలో
స్వప్నమధుర పరిరంభము.
హృదయకంపనలలోనే
ఉదయించును చిత్రమ్ములు
మధురకల్పనలలోనే
మలచబడును శిల్పమ్ములు.

నిన్ననె మిమ్ము హఠాత్తుగ
నీరదశూన్య తటిత్తుగ
విలోకించినంతలోనె
జలదరించె నాయెడంద
పలుకరించి నంతలోనె
పులకరించె నాయెడంద.
ఆస్పందనమే చిత్ర
మ్మై నిల్చెను భిత్తికపై
ఆకంపనమే సజీవ
మై మొల్చెను భిత్తికపై.
ఆ చంచల దృగంచలము
లాకుంచిత సుభ్రూలత
లాకృతిదాల్చిన చిత్రము
నదిగో చూచితిరి మీరు."
ఇటుల నిటుల నెంత సేపు
హేలాన్విత వచోధార
ప్రవహించెనొ సమయ మటులె
ప్రవహించెను తెలియకుండ
శాంతిశ్రీ కనురెప్పల
చాంచల్య మదృశ్యమయ్యె.

ఆమె యనిమిషత్వమపుడె
అందికొన్నయట్టులయ్యె.
చేతిలోన వడివేసిన
చేలాంచల మటులెయుండె.
విప్పారిన చిరుపెదవులు
విప్పారినయటులెయుండె.
పద్మదేవు డపూర్వ శో
భాధునీ తరంగడోలి
కాందోళనమున సర్వము
నాక్షణమున విస్మరించె.
జగద్భాండ మొక్క మహా
స్వర్గధామ మైనయట్లు
శాంతిశ్రీ అప్సరో వి
శాలనేత్ర యైనయట్లు
తానొక గంధర్వుడుగా
తాదాత్మ్యము జెందినట్లు
మాటలలోనే స్వప్న స
మాలింగన మొనరించెను.
శాంతిశ్రీ ఒక్కమారు
జలదరించి మేల్కొనియెను.

తాను పొందినట్టి అవ
స్థను దలంచి సిగ్గిల్లెను.
ఎటుతోచక "గృహద్వార
మేది" యంచు ప్రశ్నించెను.
పద్మదేవునికి భువిపై
బడినట్టుల యనిపించెను.
"ఏమి ఏమి" అని యడిగెను
ఏమి చెప్పగల్గు నామె ?
"ఏమి లే" దనుచు నుత్తర
మిచ్చె నసంకల్పముగా.
ఆమె గుండెలోన వీణి
యలు కదలినయట్లు దోచె
అతని మనసులోన మల్లి
యలు నవ్వినయట్లుదోచె.
అతడు ముందు కడుగువేయడు-
ఆమె వెన్క కడుగు వేయదు-
అతడు ముందు కడుగువేయ
డామె వెన్క కడుగువేయ
దిర్వురిలో కదలసాగె
నేదో అవ్యక్తబాధ.

ఆ బాధకు పేరులేదు
ఆ బాధకు నోరులేదు.
ఆ బాధకు మించిన తి
య్యని బాధయె వేరులేదు.
పద్మదేవు డంత రెండు
పదములు కుడ్యమ్ము వైపు
నడిచి సంగ్రహించె నామె
నవ్య చిత్రఫలకమ్మును.
తన అధరాంచలములపై
దరస్మితము కుట్మలించ
ఆమె పాణిపద్మములం
దర్పించెను చిత్తరువును.
చిత్తరువును స్వీకరించు
చిత్తవృత్తి లేకున్నను
మత మొక్కటిదక్క తాను
ఇతరము కోరకయున్నను
అతని కానుకను పరిగ్ర
హణము జేసెను రయమ్మున
అత డర్పించిన చిత్రము
నద్దుకొనెను హృదయమ్మున.

# తృతీయ తరంగం

విశ్వవిద్యానిలయ మదుగో
వివిధ దేశాంతర తరుణ జి
జ్ఞాసువుల బౌద్ధమత ధర్మా
భ్యాసపీఠముగా లసించెను.
నాడు నాగార్జునుడు బీజము
నాటిపోయెను; నాడునాటికి
వివిధ విజ్ఞాన ప్రశాఖల
వెలసె విద్యానిలయ వృక్షము.
బౌద్ధసూక్తి సుధాస్రవంతీ
భంగడోలల నోలలాడగ
చేరి రచటి కనేక యువతీ
తారకలు యువచంద్రమూర్తులు.

బోధనామందిరము లోపల
మూర్త బౌద్ధమతమ్ము పోలిక
కూరుచుండెను మతగురువు గం
భీర నిశ్చల ముద్ర దాలిచి.
ఆతడున్నతపీఠమందున
అధివసించెను; అతని ముందుగ
బారులుగ విద్యార్థు లెందరొ
కూరుచుండిరి మౌనమొప్పగ.
ముందుశ్రేణిని కానుపించెడు
సుందరీ బృందమున శాంతి
శ్రీ వెలింగెను తారకలలో
చిత్రమైన సుధాంశువట్టుల.
మతాచార్యుడు గళమువిప్పెను
మారుమ్రోగెను త్రిశరణమ్ములు
విశ్వవిద్యానిలయ వీథుల
విమల సంఘారామ వేదుల.
మతాచార్యవదన వినిర్గత
మధురబోధ సుధాప్రవాహ త
రంగములు విద్యార్థుల మన
శ్శ్రవణముల కుత్సవముజేసెను.

మతాచార్యుడు బౌద్ధమత స
మ్మత మహాసిద్ధాంతముల ను
న్నత మహాశ్శిఖరములనుండి ఘ
నాఘన స్వనమున వచించెను.

"క్షణమొక రూపమ్ము దాల్చు
జగత్ స్వరూపమ్ము మిథ్య
పరివర్తన రహితమ్మగు
పదార్థమే శాశ్వతమ్ము.
కాయము బుద్బుదమట్టుల
కన్పించిన మరునిముసము
మాయమగును కాన స్థిర
మ్మగు కాంతి గవేషించుము.
యౌవనమున కాప్తమిత్ర
మరిషడ్వర్గమ్ము సుమ్ము
కావున యౌవనమును శి
క్షాపంజరమున నుంచుము.
నీవు సుఖమ్మనెడు ఎండ
మావికొరకు అఱ్ఱుసాచి
తిరిగితివా తుదకు దుఃఖ
పరితప్తుడవగుట నిజము.

అహంకార మనునట్టిది
అచ్చముగా వేరుపురుగు
అది పుట్టిననాటినుండి
అంతర్జ్ఞానమ్ము తరుగు.
మమకారమ్మనునది క
మ్మని హలాహలమ్మనుమ్మ
మనకు తెలియకుండ క్రమ
మ్మున మనల దహించివేయు.
ధనవైభవ తృష్ణలు ఇం
ధనములు భోగాగ్ని కొరకు
అట్టి యనలమును నిర్వా
ణామృతఝురి చల్లార్చును.
పడగెత్తెడు పాములవలె
ప్రకోపించు ఇంద్రియములు
శమియింపగ వైరాగ్యము
చల్లని మురళీరవమ్ము.
యజ్ఞమ్ములు యాగమ్ములు
అజ్ఞులు జేసెడు చర్యలు
మనోవాసనల బలియి
చ్చిన వారే ఆచార్యులు.

కఠినవాక్యములు బాకుల
కన్న కడు నిశాతమ్ములు
కరుణోక్తులు పువురేకుల
కన్నను నవనీతమ్ములు.
కత్తినెత్తి జయించనిది
కరుణతో సులభసాధ్యము
ద్వేషముతో లభించనిది
ప్రేమతోడ సంపాద్యము.
మానినులందర మాతృస
మానమ్ముగ భావించుము
కామము గుండెల పేరెడు
కాలుష్యమ్మని యెంచుము.
శూన్యములో జననమంది
శూన్యములో నశియించెడు
క్షుద్రజీవనము విడి ని
ర్ణిద్రానందము పొందుము.
'త్రిరత్నము'ల మరి 'చత్వా
రి సత్యము'ల స్మరించి 'పం
చశీలము'ల నౌకలపై
సంసారాబ్ధిని దాటుము.

‘సమ్యగ్దృ’ ష్ట్యాది ‘అష్ట
సన్మార్గము’ లనుగమించి
చివరికి నిర్వాణ మహా
శిఖరము నారోహించుము.
బుద్ధుని శరణము పొందుము
ధర్మము శరణము పొందుము
సంఘము శరణము పొందుము
జన్మరహస్యలను గనుము.”

ఈరీతి గురుదేవు
డేకధాటిగ బౌద్ధ
మతమహాసూక్త్యమృత
మందించుచుండగా
అఖిల విద్యార్థుల హృ
దంతరమ్ములు బౌద్ధ
ధర్మపీయూష విమ
లోర్మికా డోలికల
లో నోలలాడంగ
వినిపించె సన్నగా
వేణు నిక్వాణమ్ము.

కృష్ణవేణీ తరం
గిణి తీరమున లేచి
నాగార్జున గిరీంద్ర
భాగముల మాఁగ్రోమ్మి
విశ్వవిద్యానిలయ
వీథికల వడబోసి
నిలయకుడ్యము లెక్కి
నలువైపులను జూచి
కడకు శాంతిశ్రీని
కనిపెట్టి తలయూచి
మెలమెల్లగా గుండె
తలుపురెక్కలు ద్రోసి
చొరబారె నామెలో
మురళీమృదుస్వరము.
ఒకవైపు గురుదేవు
డుత్తుంగ గంగాత
రంగస్వరమ్మెత్తి
ప్రవచించుచుండగా:
ఒకవైపు యామునో
ర్మిక రీతి వీతెంచు

వేణుగానము హృదయ
వీథి నుప్పొంగింప;
ఎటుతోచలేక ను
త్కట సంభ్రమావస్థ
లోన శాంతిశ్రీ వి
లోల మానసయయ్యె.
బోధనా మందిర
మ్మున నున్న ఇతర వి
ద్యార్థినుల కారవళి
అందియుండెనొ లేదొ
కాని; శాంతిశ్రీ మ
నో నివాసమునందు
సప్తస్వరములు లా
స్యములు చేయగసాగె.
ఆమె మురళీగీతి
కాకృష్ట హృదయమును
గురుబోధనలపై త
గుల్కొలుప యత్నించె
కాని మంజులవేణు
గాన శీథువు లామె

గుండెలో జ్వాలలు ర
గుల్కొలుప యత్నించె.
ఆమె గురుదేవునికి
సామీప్యమున నుండె
కాని గురుదేవునికి
కడు దూరమున నుండె.
చెవులందు గురుదేవు
ని వచోధ్వనులు మూగె
మనసులో మురళికా
మంద్రధ్వనులు మ్రోగె.
"ఎల్లజీవకోటులపై
చల్లుము ప్రేమామృతమ్ము
ప్రత్యేక ప్రాణిపైన
పనికిరాదు మమత్వమ్ము.
విలాసజీవన పిపాస
విసర్జనీయమ్ము సదా
చిత్తచలత నిర్వాణ
శ్రీనాశనకారి గదా!"
అని గురుదేవుడు గంభీ
ర నయోక్తులు విన్పించెను

అవి శాంతిశ్రీని సూదు
లై బల్లెములై కలచెను.
తనలో నిజముగా మన
స్తారళ్యము కలుగజొచ్చె.
తనలో నొకప్రాణిపైన
అనురాగము మొసులెత్తె.
అటువలె శాంతిశ్రీ తన
అంతశ్శోధన జేసెను.
గురుదేవుడు తన్నే హె
చ్చరించినట్టుల దోచెను.
సంశయ భయవృత్తు లొక్క
సారి శివమ్మెత్తియాడె.
శాంతిశ్రీలో ననేక
సాత్విక భావములు కూడె.
మురళిపాట కామె యెడద
మురజమ్మై మారుమ్రోగె
ఆమెలోన సమస్త వా
ద్య సమ్మేళనమ్ము సాగె
కోటివేణువులు మ్రోగెను
కోటి వీణియలు మ్రోగెను.

కోటి అప్సరసల తులా
కోటి గణమ్ములు మ్రోగెను.
శాంతిశ్రీ కనులుమూసె
శాంతిశ్రీ తనువు లేచె
నిలయమ్మును గడచి పద
మ్ములు కృష్ణకు దారితీసె
ఆచార్యుని కంటి యంచు
లామెవైపు పరుగెత్తెను
క్షణమాత్ర మతనిమోమున
సంజయెరుపు తరగెత్తెను
ఆచార్యుని భ్రుకుటి నిటా
లాంచల మారోహించెను.
ఆమె మనసు నదీతీర
మందక సంచలియించెను.
ఆమె చలించెను ఆమనిపోలిక
ఆమె చలించెను అబ్దము పోలిక
ఆమె చలించెను అతిశీత సమీ
రాహృత నదీ తరంగము పోలిక.
ఆమె వికచనయనాంబుజసీమల
లో మెరసెను సుకళామృతరూపము

ఆమె విమల కర్ణాంతర వీథుల
లో మొరసెను వంశీమృదురాగము.
అదొ పద్మదేవుండు
అదొ వేణునాళమ్ము
అతని గానమున మూ
ర్ఛితమయ్యె కాలమ్ము.
అతడు కించిన్నిమీ
లిత నేత్రుడై మురళి
పై యంగుళులు మోపి
వాయించె గీతములు.
అతడు కాంభోజి రా
గాలాపనము జేసె
ఇను డస్తగిరిని ని
ల్చొని భ్రమానువడి చూచె.
'స రి గ మ ప ద స' యనుచు
సలిపె నారోహణము
కృష్ణవేణీ తరం
గిణి గుండె పొంగారె.
'స ని ద ప మ గ రి స' యని
సలిపె నవరోహణము

కృష్ణవేణీ తరం
గిణి జలాజలపారె.
అతడు షడ్జస్వరము
నందుకొనగ మయూర
మటుల శాంతిశ్రీయు
నటనమ్ము గావించె
అతడు పంచమమెత్తి
ఆలాపనముసేయ
ఆమె కోకిల యగుచు
అమరగానముచేసె.
అతడు పాడినపాట
ఆమె ఆడినయాట
అచ్చముగ బింబించె
నాతరంగిణి నీట.
అతడు పాడుచునుండె
ఆమె ఆడుచునుండె
అతడు విశ్వముమరచె.
ఆమె సర్వముమరచె
అతడామె ఆమె అత
డైపోయినటులాయె

ఇరువురికి నడుమ గల
తెరలు మాయమ్మాయె.
అతడు చంద్రుండాయె
ఆమె చంద్రిక యాయె
అతడు తంత్రికయాయె
ఆమె మూర్ఛనయాయె.
అతడు గాయకుడయ్యె
ఆమె పల్లవియయ్యె.
అతడు కృష్ణుండయ్యె
ఆమె వల్లవి యయ్యె
అతడు వాదకుడయ్యె
ఆమె వల్లకి యయ్యె
అతడు శైబికుడయ్యె
అమె పల్లకి యయ్యె.
అతడు నేత్రంబాయె
ఆమె పక్ష్మంబాయె
అతడు గాత్రంబాయె
ఆమె పక్షంబాయె
అతడు ఉదయమ్మాయె
ఆమె తేజమ్మాయె

అతడు హృదయమ్మాయె
ఆమె భావమ్మాయె.
అతడామె ఆమెయత
డైపోయినటులాయె
ఇరువురికి నడుమగల
తెరలు మాయమ్మాయె.
నేలపై కదలు వె
న్నెల నురుంగులవోలె
నింగిలో మెదలు వ
న్నెల సింగిణులవోలె
మబ్బుపింజలవోలె
మధులిహమ్ములవోలె
అలలవలె కలలవలె
కలలవలె కళలవలె
ఎగసిపోయిరి వారు
సొగసిపోయిరి వారు
తేలిపోయిరి వారు
తూలిపోయిరి వారు.

ఆ యమూల్య మధు
రానుభూతిలో
ఆయపూ ర్వరా
గార్ద్రి గీతిలో
ఆయలౌకిక మ
హానురక్తి చాం
ద్రీ నిగూఢ రే
ఖా నిశీధినిన్.
ఆ దినాంత సం
ధ్యా మరుత్ గరుత్
చాలితోర్మికా
సరిద్వీధికన్.
ఎన్ని గడియలు గ
తించి పోయెనో
ఎంత వెన్నెల ద్ర
వించి పోయెనో.

ప్రౌఢ చంద్రికలు కై
రవ దళమ్ములబోలు
నిజ నిమీలిత మంజు

నేత్రములపై వాలి
గిలిగింతలిడగ ను
లిక్కిపడి మేల్కొనెను శాంతిశ్రీ
ఆమె న
ల్దెసల దుసికిల్లె కాంతిశ్రీ.
ఆమె పూర్వస్మృతులు
అవ్యక్తముగ వీచె
తాను సైకతవేది
పై నున్నటుల తోచె
తనశిరము పద్మదే
వుని యురమ్మున జూచె
తత్క్షణము సాధ్వస
త్రపలు పెల్లుగ వీచె.
కడలి కెరటమ్ముగవలె
తడబాటుపడి లేచె
ఒడికదల పద్మదే
వుడుగూడ కందెరచె.
లేచి కూర్చొనె నతడు
లేచి నిల్చొనె నామె
అతడు నింగికి జూచె

అమె నేలకు జూచె
ఇరువురిని ఆ తరం
గిణి జూచె నిసుమంత
కదలికయెలేని యో
గ నిబద్ధ దృష్టితో.
అతడు లజ్జా భర
మ్మతిశయింపగ నడిచె
ఆమె భయసంత్రస్త
యగుచు ఆతని విడిచె.
అతడు నిట్టూర్చి స్వక
శాలయమ్మున కేగె
ఆమె చెమటోడ్చి సం
ఘారామమున కేగె.



# చతుర్థతరంగం

మధుమాస పరిమళో
న్మత్త పవన కుమారు
చేసన్నలకు వికా
సించు మల్లికవోలె;
పద్మదేవుని స్నేహ
భావస్ఫురణచేత
దినమొక్క రేఖ శాం
తిశ్రీ వికాసించె.
పారిజాతములోన
సౌరభ పరాగములు
దినదినము విలసన
మ్మును పొందెడు విధాన;
ఆమెలో పద్మదే
వారోపితమ్మైన

ప్రణయాంకురము రెమ్మ
లనువేసి వర్ధిల్లె.
విద్యార్థినిగ నాడు
వీ తెంచినట్టి శాం
తిశ్రీకి నేటి శాం
తిశ్రీ విభిన్నయగు.
నాటి శాంతిశ్రీ మ
న స్సరసిలో మృదు
ప్రణయ పద్మము రేకు
లను విప్పగాలేదు.
నేటి శాంతిశ్రీ వి
నీల ధమ్మిల్ల భా
రమునందు దినమొక్క
రంగుపువ్వులు నవ్వు.
మతసూక్తికాలగ్న
మతియైన ఆమె సౌం
దర్య సంబంధి సూ
త్రములకే చెవియొగ్గు.
విమల సంఘారామ
వేదికల శయనించు

నామె కృష్ణా సైక
తాశ్లేషణముకోరు.
గురుదేవునికిముందు
కూరుచుండెడు నామె
పద్మదేవుని మ్రోల
పడియుండుటే కోరు.
ఆమె విద్యాలయము
నందు కలతను జెందు.
ఆమె పద్మాలయము
నందు శాంతిని పొందు.
ఆమెకు మతారామ
మత్యంత పూజ్యమ్ము
ఆమెకు కళానిలయ
మానంద రాజ్యమ్ము.
గురుదేవుని మత సూ
క్తుల ధిక్కరణ సేయు
గుండెబల మామెలో
మెందు సూపగ లేదు.
పద్మదేవునివైపు
పరువెత్తు హృదయమ్ము

నణగార్చ నామెకడ
అంకుశమ్మె లేదు.
ఆమె చిత్తము ప్రవా
హానీతమైన పూ
దోనె చందాన ఆం
దోళనము సేయంగ;
కృష్ణవేణీ సమా
కీర్ణలహరుల వోలె
ముంగురులు గాలిలో
చెంగనాలాడంగ;
ఆమె తన నర్మసఖి
యగు సుజాతను గూడి
సంఫుల్ల కుసుమాప
చయ నిమిత్తమ్ము కృ
ష్ణానదీ పరిసరో
ద్యాన సీమల కేగె.
ఆమె కానాడు మ
ల్లీ మాలతీ కుంద
మందార పారిజా
తేందీవరాదిక

ప్రసవజాలముపై మ
నసు నిల్వగాలేక
తరళదృష్టుల సుజా
తను గాంచి తలవంచె
తనకు పువులన్న చి
త్తములేదని వచించె.
వారంత నిశ్శబ్ద
వాతావరణ మంత్ర
ముగ్ధ చేతస్కులై
ముందు కల్లన సాగ
వారికెదురుగ నడిచి
వచ్చి నిల్చిన దొక్క
లలిత పద్మవనమ్ము
గళిత మాధుకణమ్ము.
పద్మ సందర్శన
ప్రథమ క్షణములోన
ఆమె చూపులు తేటు
లై జుమ్మనుచు లేచె.
జానుదఘ్నమ్మైన
సలిలమ్ములో దూరి

తనతనువు మోయజా
లని పద్మములు దూసె
తన మనసు మోయజా
లిన పద్మములు దూసె
అలసమధ్యముతోడ
అడుగులో నడుగిడుచు
తీరగతయగు వయ
స్యారత్నమును దరిసె.
ఆట సుజాతకుమారి
ఆశ్చర్యచకితయై
ఆమెపై పే రెప్ప
లల్లార్పకయె చూచె.
శాంతి యందించు పు
ష్పవ్రజము నందికొని
తనమనసులోని మా
టను ఇట్టులని చూచె.
"తోటలోపలి పుష్ప
కోటి నే నొల్ల నని
నీటిలోపలి పద్మ
వాటి కేతెంచితివి.

ఏమె చెలి ! నీవింత
గా మారిపోయితివి ?
'పద్మమ్ము' పై పంచ
ప్రాణాలు నిల్పితివి."
అంత శాంతిశ్రీ హృ
దంతర మ్ముల్కి పడె.
'పద్మ' శబ్దము గుండె
పలకపై అచ్చుపడె.
"నవ్వుటాలకు పల్కె
నా సుజాతకుమారి
భావగర్భితముగా
పలికెనో లేకున్న."
ఆమెలో నీ సంశ
యమ్ము కుబుసమువిడిచె
ఆమె నిశ్శబ్దతయె
ఆధారముగ నిల్చె.
"ఎంత బేలవె నీవు
శాంతి ! పద్మపదమ్ము
నుచ్చరింపగ వదన
మొందె వైవర్ణ్యమ్ము.

నేనొక_ర్తెనె పల్క
గా నింత బెదరెదవు,
సంఘ మెదురై వచిం
చగ నెట్లు సైచెదవు?"
అని సుజాత సమా_ప్త
మొనరించెనో లేదొ
ఆమె చటుకున సుజా
తాంభోజ హ_స్తముల
నూపి భారముగ ని
ట్టూర్చి యిట్లనిపల్కె.
"ఏమి ఏమే చెలీ!
ఏమి మాటాడెదవు.
నన్ను సందేహ బం
ధములన్ తగిల్చెదవు?
పద్మశబ్దము నాకు
ప్రాణప్రదమ్మగున?
కాదు—కాదన నోరు
రాదు ప్రాణసమాన!
పద్మమునకు న్నాకు
ప్రణయబంధమ్మన్న

వార్త సంఘము చెవుల
వరకు ప్రాకెన సఖీ!
వ్యంజనావృత్తి నా
వరకైన చాలించి
ఏమి జరిగెనో చెప్ప
వే నాకు దయయుంచి."
అని సుజాతా చుబుక
మంటి ప్రాధేయపడ
కనులందు జాలి తొ
ణ్కగ పల్కెను సుజాత.
"ఓచెలీ! నాగుండె
లో చెరువు లుప్పొంగి
చెప్పవలసిన నుడుల
కప్పివేసెను సుమ్మ.
పద్మదేవుడు శాంతి
పతితులైరని సంఘ
మంత వింతగ కోడి
యై కూసెనో సఖీ!
నీవు నిత్యము పద్మ
దేవుని కళాలయము

కేగుట మతాచార్యు
డేనాడో పసికట్టె.
నీవు వెన్నెల చీర
లే వరింపగ భిక్షు
వుల కండ్లలోన ని
ప్పులువోసినటు లయ్యె.
నీవు పద్మాహ్వాయుడు
నిండు వెన్నెలరేల
కృష్ణవేణీతటుల
క్రీడించుచుందు రని
మతశత్రువైన మ
న్మథ పూజసేతు రని
గుసగుసలు"—
—"అబ్బ ఇం
క సహించలేను చా
లించవే ప్రియసఖీ!"
యంచు కడువడి లేచు
కడలి కెరటముదాక
వడకి పోయెడు చిరుత
పడవవలె సుడివడుచు
నుడివె శాంతిశ్రీ.

తన గుండెలోన గ
ట్లను త్రెంచుకొని పారు
శోకవాహిని నాప
లేక చివరికి సుజా
తకుమారి యురములో
తన శిరమ్మును దాచి
పసిబిడ్డవోలె యే
డ్వగసాగె నామె.
ఒక కొంత సేపటికి
ఓసరిలె నామె.
తన యురముపైన వా
లిన శాంతి సంతప్త
హృదయమ్ము నోదార్చ
నెటుతోచని సుజాత
నిజనేత్ర గళితాశ్రు
నీరధారలతోడ
ఆమె శిరమునుమాత్ర
మభిషేచనము చేసె.
అంతకన్నను మించి
ఆమె చేయునదేమి ?

అశ్రుసేచనకన్న
అతిపావనమ్మేమి ?
ఇరువు రిట్టుల దుఃఖ
భరముతో డగ్గుత్తి
కలువడ్డ తమ గొంతు
కల కదల్చగలేక
ఒకరు కాదనక నిం
కొకరు మాటలురాని
జాలిచూపుల చూడ
సాగిరి పరస్పరము.
అట్టులే కొంత ద
వ్వరిగినారలు వారు.
అంతలో పద్మదే
వాగమము కనినారు.
గాయమ్ముపై నిప్పు
గాలి వీచినరీతి
పద్మదేవుని జూచి
బాధనొందెను శాంతి.
పద్మదేవుడు సమీ
పమున జేరుచునుండ

చల్లగా నిష్క్రమిం
చగ సాగెను సుజాత.
చల్లగా జారెడు సు
జాత నాపగనెంచి
శాంతి యెల్గెత్తగా
గొంతు నీరవమయ్యె.
అటు సుజాతకుమారి
అతిదూరమైపోయె
ఇటు పద్మదేవుండు
ఎదుట నిల్చొనెనాయె.
వానకాలపు మబ్బు
లైన తన నేత్రాలు
పద్మదేవుని కంట
బడగూడదని యెంచి
ఆమె తలవంచి నా
ల్గడుగు లపెటో నడిచె
అతనిని విలోకించు
ఆకాంక్షయే విడిచె.
తనను జూచిన మాత్ర
మున వెన్నెలలు పొంగు

కనుగవను నేల కా
న్చిన యామె వర్తనపు
టాంతర్య మేమొ తె
ల్యక పద్మదేవుండు
ఆమె వెన్వెంట మూ
డడుగులిడి నిల్చుండె.
అతడు వచ్చుట జూచి
ఆమె ముందుకుసాగె
ఆమె ముందుకుసాగ
అతడు నడువగసాగె.
వారిర్వు రటు లెంత
దూర మేగెడువారొ
కాని యాగిరి కృష్ణ
వేణి యడ్డమునిల్వ.
మునువైపు కృష్ణవే
ణిని శాంతి దర్శించె
వెనువైపు పద్మదే
వుని శాంతి గమనించె.
తన శుద్ధవర్తన
మ్మును నిత్యమును జూచు

కృష్ణమకు కన్నీరు
కెరలినటు లనిపించె.
తన వెనుకవైపున్న
తరుణ శిల్పబ్రహ్మ
ఊర్పులందున రోద
నోర్మికలు ధ్వనియించె.
తనచుట్టునున్న ప్రకృ
తిని జూచె నద్దాని
ప్రత్యణువులోన బా
ష్పకణాలు కన్పించె.
తనముందు కృష్ణాన
దిని జూచె నద్దాని
ప్రతితరంగము విలా
పముజేసినటు దోచె.
ప్రకృతియంతయు నిటుల
పట్టజాలని దుఃఖ
మున వెక్కివెక్కి యే
డ్చిన యటుల భావించి
ఒక్కమారుగ గుండె
వ్రక్కలై పోవునటు

విలపించె ముఖము చే
తుల దాచుకొని శాంతి.
రాలనైన ఏడ్పించగ
జాలిన ఆ రోదనమ్ము
భరియించెడు శక్తిలేక
పద్మదేవు డంత వికల
మానసుడై ముందుకురికి
మానినీ లలామను తన
హస్తాంభోజముల నిలిపి
అశ్రుకణమ్ములను తుడిచి
తలను నిమిరి నవనీతో
క్తులతో నాశ్వాసించెను
"శాంతీ! నేడేల నన్ను
వింతవానివలె చూతువు
గుండెనీరుగాగ తూల
కుమిలి కుమిలి విలపింతువు.
నను గాంచినయంత శిర
మ్మును వంచి గమింతు వేల
ఏమి నేరమును జేసితి
నింకను శిక్షించవేల.

కలనైనను నీపాదము
కందిన భరియించలేను.
జలదరింతు వనుచు నిన్ను
స్పర్శించుట మానినాను.
శాంతీ శాంతీ ఇంతటి
సంతాప మ్మేల గల్గె
పలుకవేమి నాగుండియ
పగిలిపోవుటకు ముందే."
పద్మదేవు డిటుల మిగుల
ప్రాధేయపడగ శాంతికి
మరల నేత్రముల నశ్రులు
గిరగిర తిరుగదొడంగెను.
కనులందేకాదు గొంతు
కలో గూడ బాష్పములే
తరగలెత్తి ఆమె పల్కు
తెరలను కబళించసాగె.
ఎటులో కష్టపడి యామె
ఎరిగించెను తమయిర్వురి
విమలరాగమునకు సమా
జము జేసిన వ్యాఖ్యానము.

"బౌద్ధ భిక్షువులు మన సం
బంధమ్మె నికృష్ట మనిరి
మనకీ సంఘమ్మున ని
ల్వను నీడయు లేదనిరి.
ఇంక నేను సంఘములో
నెటుల ప్రవేశించుదాన
ఎంగిలి బ్రతుకంచు నల్గు
రేవగించు కొనుచుండగ.
మన పవిత్ర బంధ మ్మే
మార్గమ్మున నిరూప్యమ్మె
మనకు పులుమబడిన పంక
మున కెన్నడు క్షాళనమ్మె.
అబ్బా ! ఎంతటి జటిల
మ్మైన సంకటము వచ్చెను
పదుగురిలోపల తలయె
త్తు దినమ్ములు పోజొచ్చెను."
ఆగిపోయె శాంతిశ్రీ
అంతకంత కినుమడించు
నిశ్వాసోల్బణముతోడ
నిరుద్ధమైపోవ గొంతు.

శాంతిశ్రీ ఒక్కొక్క వ
చక్కలము పల్కుచుండ
పద్మదేవునిలోన సం
భ్రమ కోపము లుప్పొంగెను.
చివరికి కోపము మాత్రము
చివ్వళ్లెత్తి వికసించెను.
రెండు పెదవులను పిండి చ
లించని స్వరమున పల్కెను.
"శాంతీ ఈ మాత్రమునకు
సాధ్వస మందంగ నేల
సంఘమునకు రెండు కనులు
సరిగా కన్పడవు బేల!
కాషాయాంబరములలో
కాముకు లెందరో కలరు
కాన భిక్షువుల నిందల
లో నెంత నిజమ్ముకలదు?
మన హృదయమ్ములు స్ఫటిక స
మానమ్ములుగా నుండగ
లోకులు పూసెడు పూతల
తో కారణ మేమి మనకు?

మతము దృష్టిలో స్నేహ
మ్మతి దూష్యమ్మైన గాని
మానవతను వెల్గించెడు
మహిత సాధన మ్మదియే.
మానవతయె లోపించిన
మత మెందుకు శాంతి నీకు
మతవాసన యింతలేని
మహిత జీవితము గడుపుము."
పద్మదేవుని వచ స్సం
భారముతో శాంతిశ్రీ
హృదయ సుమము కొంత సేపు
కదలక తలవాల్చియుండె.
మతముపట్ల తనలోపల
మంచుగడ్డవలె నిల్చిన
విశ్వాస మతని మాటల
వేడిలో కరగసాగెను.
"మతములేక పవిత్రముగ
బ్రతుకు మార్గమే లేదా
మతమే విశ్వకళ్యాణ
మార్గ సూచకమ్మగునా"

ఇటువలె కరగిన భావన
లేకీకృతమయ్యె మరల
గురుదేవుని సూక్తిసుధలు
గుండెలోన జారినంత.
"నీవు సుఖమ్మనెడు ఎండ
మావికొరకు అఱ్ఱుసాచి
తిరిగితివా తుదకు దుఃఖ
పరితప్తుడవగుట నిజము.
ఎల్లజీవకోటులపై
చల్లుము ప్రేమామృతమ్ము
ప్రత్యేక ప్రాణిపైన
పనికిరాదు మమత్వమ్ము.
విలాసజీవన పిపాస
విసర్జనీయమ్ము సదా
చిత్తచలత నిర్వాణ
శ్రీనాశనకారిగదా!"
గురుదేవుడు ముందుగ కను
గ్రుడ్లు దెరచి పైసూక్తుల
నుచ్చస్వరమున వచింప
జొచ్చిన దృశ్యమ్ముతోచి

ఆమె కెవ్వుమని "గురుదే
వా గురుదేవా అపరా
ధ"మ్మని నిజమృదుల కపో
లమ్ములు వాయించుకొనెను.
ఎదుట పద్మదేవు డున్న
ఉదంతమును మరచిపోయి
త్రిశరణములు పల్కుచు శాం
తిశ్రీ పర్విడసాగెను.
ఆమెలోన పొంగారు మ
తావేశమునకు బ్రమొన్పడి
కాళ్లీడ్చుచు మెల్లమెల్ల
గ సాగె పద్మదేవుండు.



# పంచమ తరంగం

ఆనాడు బుద్ధుని మ
హావతరణమ్మైన
సుమనోజ్ఞ వైశాఖ
శుద్ధ పూర్ణిమ దినము.
ఆనాడు నాగార్జు
నాద్రిలో ప్రతితరువు
బోధిభూరుహ రూప
మును ధరించిన దినము.
ఆనాడు బుద్ధుని జ
యంతి; భిక్షువుల స్వాం
తముల కోటీందు బిం
బములు వెల్గిన దినము.
నా డపరసంధ్యయై
నదొ లేదొ; ఉత్సవా

లోకనార్థము వచ్చె
రాకాసుధాకరుడు.
ఒక సుధాకరుడేల
వికసించె శతకోటి
నెలబింబములు దీప
ముల రూపములు దాల్చి.
పసుపు పచ్చని వన్నె
వసనములు దక్షిణ భు
జ వ్రజమ్మును అనా
చ్ఛాదితమ్ముగ గట్టి;
భిక్షువులు వెన్నెలల
పిండు వెదజల్లుచు స
మావిష్టులై-రదొ మ
హా చైత్యనిలయమున.
బోధివృక్షముపైన
పూలవానలు కురిసి
బుద్ధముని పాదుకలు
మూర్ధములపై నిలిపి
స్తూపములకు మృణాళ
తోరణమ్ములు వేసి

మందిరమ్మును పద్మ
మాలామయముజేసి
ఉపవిష్టులైరి భి
క్షూత్తములు; ఉపవిష్టు
డయ్యె గురుదేవు డె
త్తైన పీఠముపైన
కనుగవను మూసి ద
క్షిణ హస్తమెత్తి గురు
దేవు డనియెను 'బుద్ధ
దేవుడే శరణ'మని.
అంతలోనే మంది
రాంతరమ్మున ఘంటి
కలు మ్రోగె త్రిశరణ
మ్ములు మ్రోగె నొకసారి.
గురుదేవునికి ముందు
కూర్చున్న శాంతి గుం
డియలోన కోటి ఘం
టిక లూగినటులాయె.
ఆపాదమస్తక
మ్మామె జలదరమందె.

మీననేత్రమ్ములు ని
మీలితస్థితి నొందె.
ఆమెలో కృష్ణమ్మ
అలల పొంగులు లేచె.
తా నిసుక తిన్నియల
పై నున్నటుల దోచె.
నిన్ననే తా నశ్రు
నిమ్నగలు పారించి
నట్టి దుర్దాంత దృ
శ్యము గుండెలో నారసె.
పద్మదేవుండు తన
బాష్పధారల తుడిచి
తలనిమిరినట్టి చి
త్రము తళుక్కుమని మెరసె.
అంతటి దయామయుని
అంతటి కళాప్రియుని
విడనాడి తాను ప
ర్విడి వచ్చినట్టి సం
ఘటన మెదపైన స
మ్మెట వ్రేటుగా మారె.

శాంతి హృదయమ్ము ప
శ్చాత్తప్తమైపోయె.
“మతనిగళ సంబద్ధ
మతియగుచు శుష్క జీ
వితము గడుపుటకన్న
ఇతరమే కడుమిన్న.
పద్మదేవుని కళా
భాగినిగ తా మారి
దినములే క్షణములై
తేలిపోవుచునుండ;
సంపెంగవలె బ్రతుకు
సౌరభమ్ములు పిండ
తా నుండవలె” నంచు
తలచె శాంతిశ్రీ.
పరిసరమ్ముల నపుడు
మరచె శాంతిశ్రీ.
తనయెదుట పగలు వె
లిగిన రీతి సంపూర్ణ
విలసనమ్మున నున్న
వేల పద్మము లూగె.

ప్రతి పద్మమున నొక్క-
పద్మదేవుడు నిల్చి
తనను చేయెత్తి పి
ల్చినయట్టు లనిపించె.
తనను రాగార్ద్రనే
త్రముల నాలోకించె.
తన చుబుకమెత్తి క
మ్మని యూర్పులను దించె.
ఇట్టి స్వాప్నిక దృశ్య
మెదలోన భావించి
నర్మహాసముదోచు
నయనాల నరవిచ్చి
గల్లభాగము లించు
క వికాసమును జెంద
ముఖమండలాన జ్యో
త్స్నికలు వెల్గులు చింద;
బిసఖండముల వంటి
మసృణ హస్తాంగుళులు
బింబాధరమును చుం
బించి మెల్లగ జార

'పద్మదేవా' యంచు
పల్కె మందమ్ముగా
ఆచార్యు డురిమి యి
ట్లనె గభీరమ్ముగా.
"నేడు మహాత్యాగి బుద్ధు
ని జయంతి మహోత్సవమ్ము
నేడే మీ మనసుల ను
న్మేషమ్మొనరించు దినము.
గతమున మీ మనోదర్ప
ణ తలమ్ముల నంటుకొన్న
మషీరసము కడిగివేయ
మంచి సమయ మీనాడే.
మీలోపల నెవ్వరైన
కాలుజారి అడుసులోన
దిగినచో వచించుడిట్టి
దినమున దీక్షగై కొనుడు.
అంతఃక్షాళనముకన్న
అమల సాధనమ్ములేదు.
పాప గోపనమ్ముకన్న
పరమనైచ్యమేదిలేదు."

గురుదేవు డిటుల ప
ల్కుచు తీక్ష్ణముగ శాంతి
ఉన్మిషత నేత్రాబ్జ
యుగ్మమ్ము నే జూచె.
అంతవరకే శాంతి
అంతరంగము వింత
స్వప్నలోకమునుండి
జాగృతమ్మైపోయె.
ఆచార్యుని వచో మ
హా వహ్నిధార
ఆమె యెదలో జ్వాల
లంటించె నపుడు.
అతని చూపులలో ని
శిత వజ్రధార
ఆమె చిత్తాద్రి కో
యగసాగె నపుడు.
"తాను పద్మాహ్వాయుని
తో నిల్చిపోవ లో
కులు తన్ను క్రిందు చూ
పులతోడ చూచెదరు.

తాను మత మందిరము
త్యజియించిపోవ సం
ఘము తన్ను పతిత యని
గర్హణ మ్మొనరించు."
ఇటు లామెలోన ను
త్కట ఘర్షణమ్మాయె.
కడకామె సంశయ
గ్రంథులు సడలిపోయె.
అనలసంతప్తమగు
కనకప్రతిమవోలె
ప్రవిముక్త జలధరాం
బర మండలము వోలె
ఆమె కన్పించె నపు
డత్యంత కాంతితో
ఆమె వెల్గొందె ది
వ్యమైన శాంతితో
ఆమె సన్నిధి మాల
లై యూగు పద్మముల
కనుపడడు తాను జూ
చిన పద్మదేవుండు.

ఆమె కట్టెదుట ది
వ్య ప్రకాశముతోడ
గురుదేవు డొకడె హిమ
గిరి శిఖరమైనిల్చె.
ఝుంఝూ ప్రభంజనో
చ్చలిత పత్రములీల
వాతన తనువులేచి
లెను గురూత్తముమ్రోల.
"గురుదేవ గురుదేవ
క్షుద్రజీవిని నేను
పరిపూర్ణ మతదీక్ష
బడయగ దలచినాను.
బుద్ధదేవుని పాద
ములతోడు నేనెట్టి
పాప మెరుగనిదాన
పంక మెరుగనిదాన.
అయిన నాలో నప్పు
డప్పుడు తరగలెత్తు
చిత్త చాంచల్యము న
శించిపోయెను నేడు.

బౌద్ధమతసార మా
స్వాదన మ్మొనరింప
బ్రతుకంత గడుపగా
ప్రతినబూనెద నేను.
గురుదేవ గురుదేవ
గురుదేవ నాపైన
కరుణామృతము జల్లి
కాపాడుమయ్యా."
ఆచార్యపాదమ్ము
లందు శీర్షమునుంచి
ప్రాధేయపడి శాంతి
పలికె గొంతుక పెంచి.

ఇచట శాంతిశ్రీ గ్ర
హించె దీక్షామృతము
అచట పద్మిని హృదిని
అదరె హాలాహలము.
గత దినమ్మున శాంతి
మతమహోద్రేకమ్ము
గడలుకొన పర్విడిన

ఘటనమ్ము తన గుండె
శల్యమై బాధింపదొడగె -
క్షణమొక్క యుగముగా జరిగె -
తనకు శాంతిశ్రీ స
దా. దూరమైపోవు
నను సంశయమ్ము గుం
డెను తొలచి వేయంగ;
తన శాంతిలేని చై
త్య సజీవ శిల్పములు
మొండిరాళ్ళ విధాన
మోములను వాల్చంగ ;
తన క్రిందనున్న వసు
ధా మండల మదేమొ
గిరగిరా తిరుగసా
గిన పద్మదేవుండు
తొట్రువడియెడు కాళ్ల
త్రోసె ముందటివైపు
నడిచె మెల్లగ బోధ
నా మందిరము వైపు.

ద్వారమందు నిల్చు భిక్షువులతో
తారళ్యములేని వచస్సులతో
ననియె నిటుల "శాంతిశ్రీకొరకు
అరుదెంచితి రమ్మను డీవరకు."
వార లధిక్షేప దృష్టితోడ
పద్మదేవు నదేపనిగ జూడ
కినిసి యతడు వారల కన్గొనియె.
'వినవచ్చుటలేదా' యని అనియె.
"వెడలిపొమ్ము శాంతిశ్రీ రాదు
విడువ దామె మతదీక్షను నేడు."
అని యిర్వురు మెండు గొంతుకలతో
ననగ; పద్మదేవుడు వారలతో
"దీక్షను విడనాడుమంచు నేను
తెలుపుటకోసరమై రాలేను.
ఆమెతోడ పలికి యొక్కమాట
అగుపించను సుమ్మీ యిచ్చోట."
అన భిక్షువు లీసడించుకొనిరి.
అతనికి శాంతి కన్పించదనిరి.
పద్మదేవు డంత గొంతుపెంచి
ప్రవాదించుచుంట నాలకించి

గురుదేవుడు ద్వారముఖమ్ముననను
అరుదెంచెను; పద్మదేవుడనెను.
"ఆచార్యా! శాంతిశ్రీ తోడ
అరనిముసము సేపు మాటలాడ
అత్యవసరముగా వచ్చినాడ
అంపుడామె నిచటికి దయతోడ."
అని పద్మదేవుడనగ
గురుదేవు
డనె కోప మల్లుకొనగ.
"శాంతిశ్రీ నీముఖ మీ
జన్మలోన చూడనంచు
ప్రతినజేసె నేడు బుద్ధ
భగవానుని పాదమాని.
ఇంక నామె నెటుల చూడ
నుంకించుచునుంటి వీవు
గడిచినదానికే సిగ్గు
పడక నెటుల నిల్తువీవు."
ఆచార్యుని వాక్కులు భ
ల్లాగ్రములై తన నెఱకుల
పొడిచిన పద్మదేవుండు

నుడివెను గుప్పున లేచెదు
గుండెమంట లార్పికొనుచు
క్రుధాఫణమ్ముల నణచుచు.
"ఆచార్యా! మీ మాటల
ఆంతర్యము గమనించితి
మీర లామె కొనరించిన
మేలుసైత మూహించితి.
మతమనియెడు పచ్చి మచ్చు
మందు నామెపైన జల్లి
ఆమె కళాత్మక జీవన
మవనిపాలు జేసినారు.
మతసూక్తులు జీవిత ని
ర్మాణమ్మును చేయలేవు
సరికద, పచ్చని బ్రతుకును
సన్యాసముపైపు త్రోయు.
తరుణుల సన్యాసినులుగ
పరివర్తనజేసి మీరు
సాధించెడు ఘనకార్యము
షేధ కందుటయే లేదు."

అని పద్మాహ్వాయుడు గురుని
ఆక్షేపణ మొనరించగ
నతడు కోపసమ్మూర్ఛితు
డై తేర్కొని పల్కె నిటుల.
"చాలించుము శూద్రుడ యీ
శ్రవణభేది వచస్సులను
అపవిత్రమగును బుద్ధ జ
యంతి నీవిట నిల్చినను.
నీ కళలును నీవు మాకు
నేటినుండి త్యాజ్యమ్ములు.
నిను బహిష్కరించితి నీ
నేలనుండి తత్క్షణమ్మె
వెడలిపొమ్మె" —
— ఈ మాటలు
గడగడ గురుదేవుని ముఖ
గగనసీమ నురుమగనే
గడగడ వడకెను ఇర్వురి
నుడుల లోపలినుండి ఆ
కర్ణించెడు శాంతిశ్రీ
కదలలేని శాంతిశ్రీ.

ఆమె డెందమందు ఘర్ష
ణాందోళన మొకటిలేచె
ఆమె శపథ విషయమ్మును
అప్పటికే విస్మరించె
'తనను దేవతగ నర్చిం
చిన తన పద్మదేవునిని
దర్శించెడు స్వాతంత్ర్యము
తనకు లేకపోయెగదా.
ఎచటినుండియో పర్విడి
ఏతెంచెను తన కోసము
నిరాశతో శిరమువాల్చి
తిరిగి పోవునో యేమొ.
గురుదేవుం డయో! బహి
ష్కరించె నా పద్మమ్మును
నాకొరకు కాతండు వీడు
నా సుకళాసద్మమ్మును.
అయ్యో! ననుగూర్చి యతం
డంతటి త్యాగముసేయగ
ఇట సుఖముగ గూర్చొనియుం
టిని శిలాత్మురాల నేను."

ఈదృశాందోళనము
తో దిగులుతో శాంతి
మందిరాంతరమందు
కుందిపోవుచునుండ ;
అచట ద్వారమువద్ద
నంతకంతకు వారి
వాదవైఖరి మహా
వర్షరూపము దాల్చె.
"కళయనెడు తెరలోన
కామగోపనము చే
సితి" వంచు అతని దూ
షించె గురుదేవుండు.
"మతము పేరిట మాన
వతను విడనాడినా"
రని అతని తూలనా
డెను పద్మదేవుండు.
తుదకు పద్ముండు తన
హృదయ భాండమున తుక
తుక యుడుకు నుడులు గొం
తుకనుండి విసరె నిటు

"మానవత్వ సంరక్షణ
మహాప్రయోజనము కొరకు
మతముగాని మీరేమో
మతముకొరకు మతమందురు.
మీ సంఘారామమ్ములు
మీ బౌద్ధ విహారమ్ములు
సోమరులను పోషించెడు
ధామమ్ములుగా మారెడు.
అందరు మీవలె విరాగు
లై పోవుట అసంభవము.
అందరు మీవలె ఆత్మసు
ఖావళి వర్జించలేరు.
మీరు రుజాగ్రస్తులైన
వారి సేవచేయలేదు.
మీరు దీనమానవులకు
మేలును తలపెట్టలేదు.
సంఘారామమున ధర్మ
శాస్త్రోక్తులు వల్లించిన
సకల జగద్బాధావళి
సమసి పోవలే దెన్నడు

కృష్ణవేణి యొకవైపున
కెరలి నిండుగా పారగ
మరియొకవైపున ప్రజాళి
కరువుబరువులను క్రుంగెను.
మతసూక్తుల చర్వణమే
మహిత ధ్యేయమ్ము మీకు
మానవులుగ మీరు చేయ
బూనిన కార్యమ్ములేవి ?
మత ప్రచారమ్ముకే
మమ్ముల నుపయోగింతురు
కాని కళను సౌందర్యాం
గముగా మీరొప్పుకొనరు.
మీ మతమునకై నా కళ
మీదుగట్టి యుంటకన్న
మానవునిగచేతు దీన
మానవకోటుల సేవలు.
కళాస్వరూపిణి శాంతిని
కనలేదను బాధమాత్ర
మనవరతము నాదు గుండి
యను తొలుచుచునే యుండును.

మీ సంకుచితమతమ్ముల
మీ సంఘారామమ్ముల
విడిచిన నా కళావల్లి
వేముఖాల వికసించును.
మందిరాంతరమున నున్న
మామక హృదయ ప్రశాంతి
శాంతీ ! నిను చూడకయే
సాగిపోవుచుంటి నిదో
మరల నెన్నడైన నిన్ను
దరిసింతు ననెడు ఆశయె
నాదు ప్రాణములను కొన్ని
నాళ్ళవరకు కాపాడును.
నా కళలను నిల్పుకొన్న
నాగార్జున పర్వతమా
నాశిల్పకళా రథమును
నడిపించిన శాంతీ——"
అంతవరకె అతని కంఠ
మాగిపోయె; మందిరాంత
రముననున్న శాంతి మాన
సము నిల్చినయట్టులాయె.

ఆమె తనువు ఆమె మనసు
ఆందోళన పడసాగెను
కడ కామె తనువు రివ్వున
గడపపైననే వాలెను.
ఆమె 'పద్మదేవా' యని
ఆక్రందించెను ప్రక్కన
గురుదేవుడు కనుబొమ లె
క్కవెట్టినను లెక్కించక.
"తిరిగిరమ్మ పద్మదేవ
మరలిరమ్మ పద్మదేవ
ఈ సజీవశిల్పమ్మును
ఇచటే విడిపోయెదవా?
ఎడదను నానుండి వీడి
పడునట్లుగజేసి పొమ్మ
నాతిని నీవొక్కమాటు
రాతిగానొనర్చి పొమ్మ.
తిరిగిరమ్మ పద్మదేవ
మరలిరమ్మ పద్మదేవ"

ఆమె రోదన రోద
సీ మండలమునందు
సుడులు సుడులుగ దిరిగి
సడలిపోవుచునుండె.
ఒకసారిగా పరా
ఙ్ముఖుడైన పద్మదే
వుడు వెన్నెల బయళ్ళ
బడి మాయమగుచుండె.
శాంతి కన్నులలో ది
శాంతములు కన్పించె.
పద్మదేవుడు చంద్ర
వలయమైనటు తోచె.
గురుదేవు డంత బొం
గురు గొంతు సవరించె
శాంతి దేహాళి వీడి
సంఘవాటిక జేరె.

*

తన రాతిసెజ్జపై
తనువు వాల్చెనుగాని

మనసుమాత్రము వాల్చ
గను వశము కాలేదు.
తనకు నాలుగువైపు
లను సహాధ్యాయినులు
గాటంపు నిదుర సం
గాతమున కనుమూయ ;
తనమనసు మోయజా
లని భావభరముతో
తబ్బిబ్బుపడుచుండె
తంద్రాళు వగుచుండె.
నిదురపోలేక అరు
ణీభూతమైన క
న్నులను వెన్నెలలు సూ
దులవోలె బాధించ
భరియించలేక దు
ప్పటము మోమున గప్పె
ప్రౌఢచంద్రికలు దు
ప్పటి పొరలలో జొచ్చె.
అటుప్రక్క నిటుప్రక్క
నన్నిప్రక్కల దొరలె

ఎటుదొరలినను నిదుర
ఎండమావిగ తరలె.
జాముర్రాతియు దాటె
సామురాత్రియు దాటె
జగతి సర్వము నిదుర
బిగి కౌగిలిని మీటె.
ఎపుడు కన్నంటుకొనె
నేమొ శాంతిశ్రీకి
అపుడె స్వప్నమువంటి
అనుభూతి కదలాడె.

— — —

అదుగొ నాగార్జునాద్రి
అదుగొ కృష్ణా స్రవంతి
అవిగొ చైత్యవిహారముల్.
ఒకవైపు కృష్ణమ్మ
ఉత్తుంగముగ లేచు
పాలకెరటా లెత్తి
పర్వుదీయుచునుండె.
మరియొక్కవైపామె
నొరసికొని నిద్రించు

పండునేలలు గొంతు
లెండి బీటులువారె.
ఆమె కంతట కాన
నయ్యె వైరాగ్యమ్ము
నంది కండలు పెంచి
నట్టి భిక్షు జనమ్ము.
ఆమె కంతట కాన
నైరి అన్నాదులకు
అల్లాడి కనుమూయు
అతి దరిద్ర ప్రజలు.
ఒక్కమాటుగ నంత
ఉన్నత స్వరములో
రాగములు విడువుడని
భోగములు విడువుడని
ఎవ్వరికి వారే త
రించుడని ప్రవచించు
గురుదేవు డగుపించె
గుండియ ప్రకంపించె.
తదనంతరమ్ము సుం
దర మందహాసమ్ము

తొలకరించెడు నేత్ర
ములతోడ "మానవ
త్వామృతము నందించ
నట్టి మతమేల" యని
"సౌందర్యమే కళకు
సంకేత సదృశ" మని
ప్రావృడంభోద ది
వ్యస్వరమ్మున పలుకు
పద్మదేవుడు నిల్చె
స్వాంతమ్ము పులకించె.
కృష్ణవేణీ తరం
గిణిలోయ ఒకమారు
నాగార్జునాద్రి ఉ
న్నతపంక్తు లొకమారు
చలనచిత్రములట్లు
శాంతి కన్నుల కదలె.
మెరుపుతీవెల మింటి
పొరలలోపల దాచి
మేఘమాలలు భూమి
మీద వాలిన రీతి;

చలికాలమున లోక
ములను ముంచెడు మంచు
పొగలన్ని ఒకచోట
పుంజీభవించినటు;
బారులుగ నిల్చుండు
పర్వత శ్రేణికలు
దూది పింజలవోలె
తూలిపోయిన రీతి;
ఆ ప్రాంతమున చిత్ర
మైన రూపము నిల్చె
ఆమె లోపల స్వప్న
మందు స్వప్నము మొల్చె.
బాల భాస్కర కర
స్పర్శ మాత్రము చేత
కుంచితములై పోవు
మంచు పొరల విధాన;
ఝంఝూ మరుత్ గరుత్
చాలనము తోడ తు
నకలు తునకలై పోవు
జలదమాలిక లట్లు;

ఒక మహా వీచితో
ఒక దివ్య రోచితో
ఆ ప్రాంతమున నిల్చి
నట్టి మబ్బులు పొగలు
మచ్చుకైనను లేక
మాయమై పోయినవి.
అంత నచ్చట కాన
నయ్యె నాక్షణమందు
ఒక దివ్యసాగరము
ఒక నవ్యసాగరము.

అది నాగార్జునసాగర
మా ? ఏమో ఐన నౌను.
అది పొంగిన పాలకడలి
యా? ఏమో చెప్పలేను.
పరుగెత్తెడు తన ఆత్మను
బంధించెను కృష్ణానది
ఆమెయె ఆమహాసాగ
రాకృతి దాల్చి నిల్చినది.

అలలనెత్తి యా సాగర
మాహ్వానించెను జనతను
ఓహో సాగర మదుగో
ఓదార్చెను మానవతను
దాని కాలియంచుల మం
ద స్పర్శన మాత్రమ్మున
బీటలు వారిన నేలల
పేరెను మరకతశ్రీలు.
యోజనముల కొలదిగ తల
లూపెను నవసస్యమ్ములు
ఎటుచూచిన పచ్చదనము
పొటమరించు దృశ్యమ్ములు.
ప్రజాకోటి వదనమ్ముల
పై కలకలలాడి పోయె
నిత్య పూర్ణిమా నిశలే.
నిత్య వసంతర్తువులే
ఆ నాగార్జున సాగర
మందు నడిచి పోవుచుండె
ఎవరో ఒక కళామూర్తి
ఎవరో ఒక విమల కీర్తి

ఎవరాతడు శాంతి యతని
నెపుడో చూచిన యట్టుల
ఊహించి అతని వెంబడి
ఉన్మాదినియై పర్విడె.
అతడు హుటాహుటిగ అతి
ద్రుతగమనముతో నేగెను.
ఆమె యతనివెంట గాలి
యై వడివడిగా సాగెను.
అతనికి అయిదో పదియో
అడుగుల దూరమున నిల్చి
తేల్చుకొనె నతండు పద్మ
దేవుడంచు శాంతిశ్రీ.
"తిరిగిరమ్ము పద్మదేవ
మరలిరమ్ము పద్మదేవ
ఈ సజీవశిల్పమ్మును
ఇచటే విడిపోయెదవా"
డెందమ్మును చీల్చెడు ఆ
క్రందనమ్ము విన్నయంత
ఆతం డరనిముస మాగి
అనంతరము సాగిపోయె.

ఆమె అతని కంటబడెను
ఆమె అతని వెంటబడెను
ఆమె అతని ఉత్తరీయ
మందుకొనగ పర్వులిడెను.
ఆమె అతని ఉత్తరీయ
మందుకొన్న యట్టులాయె
కాని గాలి ఒక్కమాటు
గా వీవగ నందదాయె.
ఆమె ఉత్తరీయాంచల
మందుకొనెనొ లేదొ మరి
పద్మదేవు డామెను సం
స్పర్శించెనొలేదొ మరి.
ఆమె కేవల స్వప్నము
నందీ దృశ్యమ్ము గనెనొ
ఆమె నిజముగానే నా
గార్జున సాగరము గనెనొ.
అది స్వప్నమ్మొ శాశ్వత
మైన విశ్వసత్యమ్మొ
అది సంఘారామమ్మొ
ఉదయసూర్య ధామమ్మొ.

"అది నిజముగ స్వప్నమేని
అటులె నిల్చియుండుగాత
శాంతిశ్రీ పద్మదేవ
సాన్నిధ్యము పొందుగాత."
ఇట్టుల అవ్యక్త గళ
మ్మెత్తి యెవ్వరో పాడిరి.
కాబోలును నాగార్జున
క్రమసాగరోర్మికలే
కాబోలును కళాతంత్రి
కా ఝుంకృతి మాలికలే
కాబోలు మహాకావ్య జ
గద్గీతీ డోలికలే.



# MaNaSu Foundation

## check list

| | |
|---|---|
| Book Number | CP03-A-212 |
| Condition | |
| Front Cover | yes |
| Back Cover | yes |
| Blank Pages | CP, 008 |
| Missing Pages | |
| Others | - |
| Remarks | - |